Reg. No. 757.

# అభినవసరస్వతి

యుగునోక మాసపత్రిక.

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

బ్రచురింపఁబడుచున్నది.

జానపాడు.




| సంపుటము 16 | 1924 సం॥ నవంబరు. | సంచిక 8. |
|---|---|---|

## విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 3 0 0 |


Printed at the Chandrika Press, Guntur,
aud published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry.

## చందా దయచేసిన ప్రధానపోషకులు.

౧ రామలింగుగారు- నెల్లుట్లపాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.
౨ బాకరాజు పరాంకుశరావుగారు యాదవరం.
౩ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు

## పో ష కు లు.

౧ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానకొండూరు
౨ ఎనమండ్రి లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ
౩ రాజా వెంకటాద్రియప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు
౪ రాజామంత్రిప్రెగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మొగ్గంపాడు
౬ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ గారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి, దేశముఖుగార్లు నాగారుణపురము
౧౦ డి. లక్ష్మణసింగుగారు, జోనగాం
౧౧ నెల్లుట్ల నరసింహారావుగారు, జోనగాం
౧౨ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె,
౧౩ చేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము
౧౪ శీతలసింగుగారు, మర్చెంటు, నాగవరము

## స హా యు లు.

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము
౨ నడింపల్లి నరసింహారావుగారు, జిల్లా రిజిష్ట్రాఫీసు, గుంటూరు
౩ తాచకొండ వెంకటరామయ్యగారు, రేమనపుడల
౪ బుదంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౫ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తాలూకాదారు, మిరియాలగూడ
౬ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు, బెజవాడ
౭ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౮ రంగరాజు గోపాలకిషన్‌రావు దేశముఖుగారు, పాపురం
౯ నారాయణరావుగారు, దాతారుపల్లె
౧౦ బెల్లూరి రామన్నగుప్తగారు - సదాశివునిపేట
౧౧ రాచూరి సుబ్బయ్యగారు . శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి
౧౨ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం
౧౩ దండు గుండేరావుగారు, కరణము - ...
౧౪ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు పటేలు - ...
౧౫ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట

# అభినవసరస్వతి

సంపుటము ౧౬ { జానపాడు / రక్తాక్షి సం॥ కార్తికమాసము. } సంచిక ౮

# పాకయాజిగారి ప్రల్లదములు.

"పెదమాంతాచార్యులవారు పీఠమునకు సంబంధించిన యాస్తి నమ్మి యిరువది వేలరూపాయలు పోగుచేసి పుత్రులకు భూములుకొనియిచ్చిరని శంకరమంచి లక్ష్మీనారాయణశాస్త్రిగారు వ్రాసినందులకుఁ బాకయాజిగా "రింత యనుచితప్రసంగమేమున్న" దని గుంజుకొనుచున్నవారు. ఈశాస్త్రిగారే "యీపీఠము నూటయిరువది సంవత్సరములనుంచి దుర్దశ ననుభవించి పెదమాంతాచార్యుల కాధిపత్యమువచ్చిన వెంటనే విగతప్రాణమయ్యె" నని యనినవారఁట. అన్నాళ్ళనుండి దుర్దశయనుభవించిన పీఠపు టాస్తి యిరువదివేలరూపాయల విలువయుండదఁట. అంతవిలువచేసెడి యాస్తియున్నపు డాపీఠము దుర్దశలోనుండినది కాదఁట. ఇట్లు వివేకముగలవారు మాటలాడరఁట. వివేకమునకును బాండిత్యమునకును సౌజన్యమునకును నన్నిటికిని బాకయాజిగారె నిధానము. కానిచోఁ బ్రతిపదమును బ్రతివారినిగూర్చియు నిట్లువ్రాయరు. ఆపీఠము ౧౨౦సం॥ నుండి దుర్దశయనుభవించుచున్నదని లక్ష్మీనారాయణశాస్త్రియే వ్రాయుటేమి ? పాకయాజిగారే పలుచోట్ల వ్రాసియుండిరి. ఎంతదుర్దశలోనున్నను నెంతవిగతప్రాణమైనను పీఠమునుచోట ౨౦౦౦౦ రూపాయలయాస్తియుండుట యొకయబ్బురము కాదు. ఇతరక్షేత్రములలోని దేవతామూర్తులకైననే వేలరూపాయల విలువగల నగలు కనఁబడుచున్నవి. ఆస్తి లక్షలరూపాయలకు మించియున్నది. కావునఁ బాకయాజిగారీవిషయమున నింత యాగ్రహము తెచ్చికొనుటనవసరము. ఇంతకే వివేకములెన్నుట విరుద్ధము. తమకును దత్పీఠమునకును సంబంధము కుదిరిననాఁటనుండి స్థలభాండశుద్ధి యైయుండునట్లు చేసి పాకయాజిగారిట్లు భావించుచున్నారు. అంతకుముందు పెదమాంతాచార్యులవారు ప్రవేశించునప్పటి కిరువదివేలరూపాయలయాస్తియే కాదు. అంతకధికమున్నదని చెప్పుటకు నక్ష్యంతరములేదు. బండ్లు గుఱ్ఱములు లొట్టిపిట్టలు ఏనుఁగులు మున్నగునవి యన్నియు నాపీఠమునఁగూడ నున్నయవి. ఆసంగతి లక్ష్మీనారాయణశాస్త్రికి సాకల్యము తెలియక పోవచ్చును. అంతమాత్రముననే మహాదోషమువాటిల్లదు. తత్పీఠస్థ గజాశ్వాందోళికాది వైభవమును గనులారఁ గాంచియున్న పెద్దమనుష్యు లిప్పటికిని గోదావరీమండలమున

బలుమందియున్న వారు. పెదమాంతాచార్యుల కాధిపత్యమువచ్చినవెంటనే విగతప్రాణమయ్యెనను లక్ష్మీనారాయణశాస్త్రివాక్యములో లవమేని యసత్యములేదు. ప్రాణశబ్దార్థ మొక ధనద్రవ్యాదులే కాదు. సర్వమును. పెదమాంతాచార్యుల కాలమునఁ బీఠపును మర్యాదయే ప్రజలయందు లేకుండనైనది. దేవతామూర్తులదగ్గఱనుండి తెగనమ్ముకొని తినుచుఁ బోగబండిమీఁదఁబడి భూప్రదక్షిణములు చేయుస్వాములపై జనుల కేమిగౌరవ ముండెడిని ? కనుకనే విగతప్రాణమయ్యె ననుటకు వింతఁజెంద నవసరములేదు. “పాత్రాధారం ఘృతంవా ఘృతాధారం పాత్రంవా” యనితర్కించితర్కించి పాకయాజిగారు తుదకుఁ బెదమాంతాచార్యులవారు పుత్రులకు భూములు కొనిపెట్టినది లేనిది యక్కడికివెళ్ళి చూతుమని పిలుచుచున్నారు. అనుమానప్రమాణమున సాధింపలేక ప్రత్యక్షమునకు వచ్చుచున్నారు. అదియే మాకుఁ గావలసినది. పెదమాంతాచార్యులవారి పుత్రులేనుఁగుమహాలులో నెట్టిస్థితిలోనున్నది యీనడుమ నిందుకొఱకే యెందఱో యేగియీక్షించి వచ్చియున్నారు. వారు వారిభూస్థితియే కాదు పుత్రులయింటఁ బెదమాంతాచార్యులవారిస్థితియు, స్థితియేకాదు కృతియుఁ జూచివచ్చిరి. కావునఁ దత్పుత్రులు జీవనమునకులేక బాధపడుటలేదు. స్థితిగతులు గలిగియే యున్నారు.

పా॥ జి గారిట్లువ్యర్థాలాపములు చేసిచేసి “ పుష్పగిరిపీఠాధిపతులును బంధువులకుఁ దోఁచిపెట్టుచున్నా ” రని మాటకుమాట వ్రాసినారు. గతించినపుష్పగిరిస్వాములవారు సోదరులఁబెంచి వివాహాదులు గావించిరఁట. వేలరూపాయలు వెచ్చించిరఁట. వారిసోదరులు సం॥ కు ముప్పది నలుబది పుట్లు వడ్లువచ్చెడి భూములు గలిగియుండియుఁ జిన్నతనముననే తలిదండ్రులం గోలుపోయి పెంచి పెద్దఁజేయువారు లేక పీఠసన్నిధిని వచ్చిపడియుండ సన్నిధివారు మేనేజిమెంటు వహించి తద్బాలకుల భూములమీఁద నేటేటవచ్చు ద్రవ్యమంతయుం దెప్పించికొని వారివివాహాదులకు వ్యయ పెట్టఁగాఁబెట్టఁగాఁ దుదకు శ్రీవారు సిద్ధిఁబొందునాఁటికి కాఱువేలరూపాయలు సన్నిధిని మిగిలియుండెను. పా॥ జి గారీగుట్టు తెలిసికొంతయుఁ దెలియకకొంతయు నవ్యక్తప్రలాపములు చేయుచున్నారు. ఇంతటి పీఠవైభవముతోఁ జిన్నతమ్ముని వివాహమునకుఁ దరలిపోయియున్నారని మఱియొక ప్రేలుడు ప్రేలుచున్నారు. ఏమైనను ప్రేలెడిని ఇందలిసత్యాసత్యములు విమర్శించి తగిననివృత్తి యొనరించుదక్షుఁడు గనఁబడనప్పు డేమిప్రేల కెట్లుండెడిని ? వీరు వెనుక శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారితో నిట్లే నిరర్థకకలహము పెట్టుకొనినప్పు “ డివి చర్చించి నిలుపుకొనినయెడ శ్రీపాద వెంకటాధ్వరిపుత్రి లయ్యెద ” రని వ్రాసియుండిరి. అందులకు శ్రీశాస్త్రిగారు “ జయాపజయములు దైవాధీనంబు లుగదా ! ఇది యొకతండ్రికిం బుట్టినవాఁడు వ్రాయవలసిన

మాటయేనా ? ఛీఛీఛీ మీరు ౯ వ విషయములో గాంధిమహాత్ముని యస్పృశ్యతాఖండ నము సమర్థించుటనుగూర్చి నేను వ్రాసినట్లు నిశ్చయించివ్రాసితిరి. ఇది నావ్యాసము లో నెచ్చటనైనఁగాని యున్నట్లు మీరు చూపఁగలరా ? చూపలేనిచో మీరు మీతం డ్రికిఁ బుట్టలేదని పాడుకుంకలని నేను మీవలె వ్రాయసాహసింతునా ? " యని బదులు వ్రాసిరి. అట్లువ్రాసెడి పా॥ జిగారు పుష్పగిరిపీఠాధిపతులు పీఠవైభవముతోఁ జిన్నతమ్మునివివాహమునకుఁ దరలిపోవుట ఋజువుచేయలేనిచో నెవరికిఁబుట్టినవారగు దురోకదా ! మఱియు వీరు ప్రకృతపుష్పగిరిపీఠాధిపతులకుఁ జదువురాదని చినమాంతా చార్యులవారాక్షేపింపఁగా లక్ష్మీనారాయణశాస్త్రి " మీకు గుత్తా లున్నవా ? బండ్లు కలవా? ఎద్దు లేవి ? ఏనుఁగు లెక్కడ నున్నవి ? భుజకీర్తులు కిరీటాలు సూర్య చంద్రహారాలు వేయరేమి " యని యడిగి " పీఠాధిపతులగు మాగురువులకుఁ జదువు తోఁ బ్రయోజనములేదు వారికి భాగ్యమే కావలసినది " యని " న విద్యా కారణం పుంసాం భాగ్యమేవహి కారణం, భాగ్యం ఫలతి సర్వత్ర న విద్యా న చ పౌరుష " మ్మను శ్లోకమును ప్రమాణముగాఁ జూపియున్నాఁడనియు నిటువంటి యపండితులు వ్రాసెడి పత్రికలను బ్రమాణబుద్ధితోఁ జదివెడివానికంటె మానవాధముఁడు వేఱుగ నుండఁడని చాటిచెప్పవచ్చుననియు నొకయభాండము వేయుచున్నారు. ఆయన నిజ ముగా నట్లువ్రాసియుండినచో నట్టి పత్రికను జదువువాఁడు మానవాధముఁడని యొప్పు కొనవలసినదే. కాని తద్వ్యాసములో నీపంక్తులు లేకున్నఁ బా॥ జిగా రెవరికో పుట్టిన వారును మానవాధమాధములును నగుటట్లుండఁ గృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసినట్లు రెండుశృంగములుగల వీరికి నాల్గుపదంబులుగూడ నున్న బాగుగ సరిపడియుండుటకు వీరాడుమాట లధోముఖంబునుండి వచ్చినట్లుండుటకును సందియముండదు. ప్రకృతపుష్ప గిరి పీఠాధిపతులకుఁ జదువురాదని గురువులగు చినమాంతాచార్యులవారు వ్రాసిరి. లక్ష్మీ నారాయణశాస్త్రి యపండితుఁడని శిష్యులగు పా॥ జిగారు వ్రాసిరి. చినమాంతాచార్యుల వారు కానఁ బుట్టుటతోనే చదువంతయు నేర్చుకొనివచ్చిరి కాని యందఱికి నెట్లురాఁ గలదు ? చదువుకొన్నందులకు సార్థకమేమి ? చదువువలన శాంతశమదమాదిసద్గుణము లలవడవలె. సర్వసముఁడై వర్తిలవలెఁగాని " విద్యా వివాదాయ " యనునది యన్వ ర్థముచేయుటకా తదుపయోగము ? ప్రకృతపుష్పగిరిపీఠాధిపతులకుఁ జదువు వచ్చునో రాదో ! చదువుకొన్నచదువు శమదమాదిసద్గుణసంపత్తికి సంజనకమై సార్థకమగుచున్న దో లేదో పరిశీలించిన పెద్దమనుష్యులకు బాగుగాఁ దెలియుచునే యున్నది. తెలియఁ గలదు. చదువునకుఁదుద యెక్కడికి ? ' సహిసర్వ స్సర్వం జానాతి ' చినమాంతా చార్యులును సర్వజ్ఞులు కారు. వారికిఁ జదువురాదను వారును బలసినంతమంది గలరు.

ఇఁక లక్ష్మీనారాయణశాస్త్రి అపండితుఁడనుట పా॥ జీగారి నోటిక్రొవ్వువలనఁగాని వేఱొండువిధమునఁగాదు. ఎన్నాళ్ళోయాయనవద్దఁ జదువుకొనినఁగాని పండితుఁడుకాని తానిట్లనుట యిఁక నెందువలననగును ? ౪ యేఱుడుముక్కలు ప్రోగుచేసికొని లెక్చరులిచ్చుటయు వ్యాసములు వ్రాయుటయు నే పాండిత్యమనుకొని పా॥జీగారు పండితుల నపండితులఁజేయ బయలువెడలిరి. వెడలుదురుగాక; పండితపరిషత్తునఁ బ్రసంగింపఁ దటస్థించిననాఁడుగాని పస బయటఁబడదు. ప్రకృతపుష్పగిరి పీఠాధిపతుల పూర్వాశ్రమసోదరులగు గింజుపల్లి పున్నయ్యగారు ముం దేస్థితియందోయుండి యిప్పుడేస్థితికో వచ్చినారఁట. పున్నయ్యగారనఁగా గతించినస్వాములవారికి బహిఃప్రాణము. వీరినిజూడక వారు ముహూర్తమాత్రముగూడ నుండలేకపోయెడివారు. ఇది బహుజనవిదితము. అపుడు పున్నయ్యగారికిఁ దత్సంస్థానమున నేజెంటుపని. అనఁగా దివానుతరువాతియధికారము. (సేనాధిపతి) అట్టివారు తమ్ములు పీఠమెక్కినతరువాతఁ గొన్నాళ్ళు సన్నిధికేరాక తుదకు సన్నిధిస్థోద్యోగుల బలవంతముచే వచ్చియుండుచుండిరి. పూర్వాశ్రమసోదరులుకదాయని స్వాములవారు వీరిని బిలువరు. తలఁపరు. స్వాములవారి పూర్వాశ్రమసోదరులనియు వెనుకటినుండియు నేతత్పీఠ కార్యనిర్వాహకులుగా నుండిరనియు నితరోద్యోగు లగ్రాధికారపదవి నధిష్ఠింపించిరికాని యధ్యక్షు లంతరంగమిచ్చి మన్నింపమికి విచారించుచు వారు నిరుత్సాహులయియే యుందురు. మునుపటికంటె నెక్కువభారము నొదల వైచికొనియుండు వీరికి సంస్థానవిషయిక సర్వకార్యనిర్వాహపూర్వకతత్పురోవృద్ధ్యనుకూలసదుపాయాన్వేషణజనితవ్యాకులిత మనస్కత్వము దప్ప వెనుకటికంటె వచ్చినయౌన్నత్య మేమియుఁ గనఁబడదు. అధ్యక్షు లంతరంగమీయమికిఁ గలకారణ మవ్వారి పూర్వాశ్రమీయబంధుజనోపర్యనురాగాభావమే కాని వేఱుకాదు. ఆశ్రమస్వీకారానంతర మవశ్యము నాచరింపఁదగిన మాతృదర్శనవందన సత్కారకరణములకే యింతవఱ కీయకొనని శ్రీవారివిరక్తికి మేరలేదు. పాకయాజిగారును మాంతాచార్యులును నెప్పటికి నొక్కటేస్థితితో నున్న నుందురుకాని తక్కిం గలవారిస్థితికి మార్పుగూడఁగలుగుచునే యుండును. చాలమంది తాలూకాగుమాస్తాగిరి దగ్గఱనుండి యొక్కొక్కమెట్టెక్కియే తహశీల్దారులును గలెక్టరులును నగుచున్నవారు. వారిపొజెషను ననుసరించి స్థితియు మాఱుచుండును. అట్లే చిన్ననాఁటినుండియుఁ దదాస్థానమునఁ గొలువుచేయుచున్న పున్నయ్యగారు క్రమముగాఁ బ్రమోషనుకు వచ్చి దివానులయినప్పుడు స్థితి మాఱనేమాఱును.

"జీతములిచ్చుటలో నవి దోషములుగాఁ గనఁబడలేదా" యని పా॥ జీగారు ప్రశ్నించుచున్నారు. ఏదినము నిన్నూటయేబదిరూప్యములవ్యయమునకుఁ దక్కువలేకుం

డనుండు నేతత్సంస్థానికుల కింతమందికి జీతమిచ్చునధికార మెంతమాత్రమును లేదు. అట్టియధికారము జుట్టుకు రెండురూపాయలవంతున శ్రోత్రిలయొద్దను భిక్షుకుఁ బదిరూపాయలవంతున బేరులయొద్దను వసూలుచేయు శ్రీశృంగేరిశ్రీవిరూపాక్షసంస్థాన శ్రీపీఠాధికారులగు చినమాంతాచార్యులవారి కుఁడవచ్చును. నిత్యసువాసినులగు సువాసినుల నొకరిరువురిని వంతమందియేమైన యత్యంతప్రియశిష్యులను దప్ప నన్యుల నవలకనిచి యారగించు నాస్థానికులకంతయు నవశిష్టమయ్యెడిని. అట్టివారలే జీతము తీయవలెఁగాని యన్యు లేమియీయఁగలరు? ఇచ్చినను నెంతమంది కని యిత్తురు? రామకృష్ణచయనుల వారు లక్ష్మణసోమయాజులుగారు లక్ష్మినారాయణశాస్త్రిగారు నేనుమాత్రమేమైన నింతయో యంతయో జీతమిత్తు రనుకొందము. పా॥ జిగారిలిష్టుప్రకారమే దూషణపత్రికాపతులము మేము నలువురమేకాక గుంటూరు గోరంట్ల చెరుకూరు మత్తిపూడి బాపట్ల మంగళగిరి నర్సారావుపేట మున్నగుగ్రామములవారు సహస్రసంఖ్యకుఁ దక్కువలేకుండ నుండియుండిరి. వీరి కందఱకుం బ్రతిదిన మొక్కొక్కరి కొక్కొక్కరూపాయి యిచ్చినను నెలకు ముప్పదివేలరూపాయలు కావలయును. నిత్యకృత్యమునకే నెలకు నేడెనిమిదివేలరూపాయలు కావలసినసంస్థానికులు మముబోటిదూషణపత్రికాపతులకుఁ బైనముప్పదివేలరూపాయ లెక్కడనుండి తెత్తురో యోజింపవలసినవిషయము. దూషణమో భూషణమో చినమాంతాచార్యులవారు మాదేశగురువులు కారనియుఁ బుష్పగిరి పీఠాధిపతులే మాదేశగురువులనియు వ్రాసెడివారు వేలో లక్షలో కోట్లో యున్నవారు కాని చినమాంతాచార్యులవారే సకలజగద్గురువులనియు శృంగగిరిపుష్పగిరివిరూపాక్షాది పీఠములన్నియుఁ దచ్ఛిష్యపీఠములనియు వ్రాసెడివారు గురుపరమగురువులను దీసివేసిన నిప్పటికి బయటికివచ్చినవార లిరువురు కనఁబడుచున్నారు. వారు పా॥ జిగారును రామేశ్వరశర్మగారును. వీర లిరువురకును జీతములిచ్చుటకుఁ జినమాంతాచార్యులవారికి ఘనమైనపనిగాదు. కనుకఁ బా॥ జిగారు జీతములమాట నిఁకఁ దలపెట్టకుందురుగాక. పక్షపాతపుప్రాఁతలు తమవికాని మావికావు.

ఇంతకును బెదమాంతాచార్యులవారు తామధిష్ఠించుటతోడనే పీఠమును విగతప్రాణముచేసి పుత్రులకు భూములు కొనిపెట్టిరని లక్ష్మినారాయణశాస్త్రి వ్రాసిన దానిమీఁదఁ గదా యిదియంతయు బయలుదేరినది? దానికిఁ బా॥ జిగారు చెప్పినప్రత్యుత్తరమేమి? మీస్వాములవారుకూడఁ బూర్వాశ్రమబంధువులకుఁ బుష్కలద్రవ్య మిచ్చుచున్నారని. ఇత్తురుగాక. వీరు సదండులు. సదండు లజ్ఞానులనియు విదండులు విజ్ఞానులనియుఁ బా॥ జిగారివ్యాఖ్యానము. అజ్ఞానులుచేసినపనియే జ్ఞానులు చేసినప్పుడు వీరిజ్ఞానమునఁగల విశేషమేమి? విజయవాడయతులవలె వీరును రైళ్ళలోఁ బ్రయాణముచేసిన వీరియాధిక్య మేము

న్నది? ఇఁక నేల యిట్లు వ్రాసుకొనవలెను? ఇట్టియుముకదంపుడుమాటలు వ్రాసి యేల
పరిహాసపాత్రులు కావలె? పా॥ జిగారికనైనను జ్ఞానము దెచ్చుకొని లేఖినిని విశ్రమింపఁ
జేయుదురు గాక. తాంబూలచర్వణవిదేశకంచుకధారణము లొనరించెడి చినమాంతాచా
ర్యులవారు పరివ్రాజకబ్రువులని యందఱు నాక్షేపించిరఁట. అయ్యది యాక్షేపణీయ
విషయము కాదని పా॥ జిగారుకూడ వాదింపరఁట. కాని గజారోహణ శకటారోహణ
కిరీటధారణాదులు పుష్పగిరిపీఠాధిపతులు చేయుచున్నారు కావున మాగురువులు తాం
బూలచర్వణకంచుకధారణసువాసినీహస్తస్వహస్తన్యస్తకబళభక్షణాదికములు చేయుచు
న్నారు. సిగ్గువిడిచి తాంబూలచర్వణము నాక్షేపించుటమావ్యము కాదా యని ప్రశ్నిం
చుచున్నారు. ఇంతకంటె సిగ్గువిడిచినప్రసంగము వేఱె యేమి కావలయును? ముంజేతి
కంకణమున కద్ద మెందులకు? మద్యపానమాంసభక్షణాద్యకార్యకరణ మేదేని చేయుచు
న్నటు లాక్షేపింపఁబడినప్పుడు చేయుటలేదనికాని చేసిన దోషము గాదనికాని నిరూపిం
చుకొనవలయును గాని వారు చేయుటలేదా? వీరు చేయుటలేదా? యనినఁ జెప్పెడిదేమి
యున్నది. అట్టివారు మఱల నధికులమని చెప్పుకొనుట యెందులకు? ఇయ్యది 'తుష్యతు
దుర్జన' యను న్యాయము ననుసరించినది కాని పుష్పగిర్యాదిపీఠాధిపతుల గజారోహణా
దులు దుష్టములని యొప్పుకొనునది కాదు. గజారోహణాదికము లితరయతులకు దోషదా
యకములు కాని పీఠాధిపతులకుఁ గావు. విద్యారణ్యులతపశ్చర్యచే లక్ష్మీసరస్వతులు పరి
తృప్తలై పూర్వమట్లు వరమిచ్చియుండినారు. చూడుఁడు. రేణుకాతంత్రము శ్లో॥ ఏత
న్మఖ్యచ్ఛత్రమాందోళికాది యద్యద్దత్తం రాజభీ రాజచిహ్నం తత్సర్వం తే ధారితం
చాపి భూయాత్ నిర్దోషిత్వం తేషు పీఠక్రమేణ॥

ఇట్లు శ్వేతచ్ఛత్రకిరీటధారణగజారోహణాది రాజదత్తరాజచిహ్నములు నిర్దో
షములని చెప్పఁబడుటచేతనే పరంపరగాఁ బీఠాధిపతు లట్లుధరించుచున్నారు. లోకులు
హర్షించుచున్నారు. క్రిందుమీఁదెఱుఁగని యసంబద్ధప్రలాపి కనుక పా॥ జిగారిది
యడిగిరి. కాని విజ్ఞు లెవరును నడుగరు. ఇట్టిపా॥జిగారు జి. యస్. బి. సరస్వతి తొత్తు
నుంచుకొనలేదా యని ప్రశ్నించి దానిఁగూడ నుపాదేయముగాఁ బరిగణింతురుగాఁ
బోలు. సంతోషము. "రామకృష్ణసోమయాజిగారు వేలకొలఁదిధనమార్జించి యీనడు
మఁగావించిన చయనముతో భారతలోకమునంతను దత్రాపి శ్రౌతిసంతతినంతను బరా
భవముగావించియున్నా" రని పా॥జిగారు మరల వారిపైఁబడుచున్నారు. పత్రికప్రా
రంభించినదిమొదలు పా॥జిగారు పండితదూషణమే ప్రధానముగాఁబెట్టుకొని యందును
బేరఁబెట్టియో పెట్టకయో రామకృష్ణచయనులవారి యుసురుపోసికొనకయున్న పత్రమే
లేదు. పెక్కండ్రు పెద్దమనుష్యు లిందులకుఁ జీవాట్లుపెట్టి విసికిపోయియున్నవారు

పుణ్యమో పురుషార్థమో యార్జించుకొనుటకు వారుచేసిన చయనముభారతలోకమునకును శ్రోత్రియసంతతికిని బరాభవదాయక మగుటయేల ? చూడలేకయా ? పండితులప్రాభవ మంతయుం బలుగాకులకుం బరాభవదాయకమే యగుచుండును. అది వారిదురదృష్టము. తమకు లేకపోయెనని యొకయేడుపు; ఎదుటివారి కుండెనని యొకయేడుపు. ఇది యసహనముగదా ? రామకృష్ణసోమయాజిగారిచయనము లౌకికముగాని వైదికముగాదని వీరి సంజీవని చక్కగా ఋజువుచేసియుండెనంట. ఏమీ వానినిపుణత? ఇది శ్రుతిధర్మసంజీవనికాక పాకయాజిసంజీవనిగూడ నయ్యెనోటు ? సా॥జిగారు పరలోకమున కెప్పుడు పోయిరి ? కాకున్న నది తత్సంజీవని యెటులయ్యె ? అది యట్లుండనిండు. ఋత్విక్కులుగానున్నవారి నడిగినయెడం జయనదుస్థితి దెలియంగలదంట. సా॥జిగారివంటిభ్రష్టుం డెవండేని వారిచయనమునకు వంకపెట్టుంగాక. అయ్యది వారిప్రతిష్ఠకు భంగకరముకాదు. ఏనుంగునెక్కి యేగెడివానిం జూచి యెన్నిశునకములు మొఱుంగవు? చయనులవారు కోర్టులలో నిచ్చినసాక్ష్యములను వేసినవ్యాజ్యములను వినినవా రెవ్వరును లౌకికచయనులవారిచే స్వాములవారు పరాభవింపంబడిరని తలంపంజాలరంట. ఇందలియథార్థమేమో తెలిసికొనం బా॥జిగారికడకే పోయిగావలయును. ఎందుకువచ్చినగోల యిది ?

లక్ష్మీనారాయణశాస్త్రి రామకృష్ణచయనులవారిచేం జి· మాంతాచార్యులవా రనేక విషయములం బరాభవముంబొందియున్నారనివ్రాసినందులకుం బా॥ జిగారేమేమో కొక్కరించుచున్నారు. చినమాంతాచార్యులవారి యహంకారగర్వంసినిని ఖండించుచు రామకృష్ణచయనులవారు బాలబోధినివ్రాయంగా గురుధిక్కార మొనరించితివని వారికి వీరు బహిష్కారము పంపిరి. ఆబహిష్కారపత్రిక తనయధికారము తాను జూపలేకపోంగాం దన్నుంజేసికొనినాయిన శిష్యునకు వరంగలు సభవారిచే బహిష్కారమువేయించినది. ఇది చినమాంతాచార్యులవారి జయమో పరాజయమో పాఠకులే పరిశీలింతురుగాక. ఇది మొదటిది. ఇంక రెండవది యజ్ఞముఖమునం బ్రాయశ్చిత్తపశువొక్కటియా రెండా యనువాదమున రామకృష్ణచయనులవారు బెజవాడలో మహాజనసభ జరిపించియుండ నవసరప్రశ్నములు కొన్నిచేసి సమాధానము వినయనేరక సభనుండి వెడలిపోయి బహుదేశములనుండిపఱితెంచిన కలియుండిమహాపండితు లేకగ్రీవముగాం బ్రాయశ్చిత్తపశువులు రెండని తీర్మానించినపై మరల నేమూలనో తనకుం దగ్గర బంధువులగు తాతాచార్యుడు శాస్త్రిప్రభృతులం గొందఱింగూర్చుకొని యొక్కటేపశువని తీర్మానించుకొని యీతీర్మానముపై రామకృష్ణచయనులవారిచే వ్రాయంబడిన గ్రంథమును ఖండింపలేక యూరకుండుట. ఇదియు జయమో పరాజయమో విజ్ఞులు విమర్శింతురుగాక. ఈకారణములవలన లక్ష్మీనారాయణశాస్త్రి వ్రాసినదానికిం బా॥ జిగారు

పలవరింప నవసరములేదు. శ్రీపౌరిదిగ్విజయయాత్రలఁ బ్రశంసించిన రామేశ్వరశర్మగారికిఁ గూడ నిదియే ప్రత్యుత్తరసంగ్రహము. వీరైనచో విస్తరించి విన్నవింతుము. చయనుల వారి వాక్యములకు సంక్షేపముగాఁ బ్రమాణముల నిదివఱకే కనఁబఱచితిమి. కావల యున్న మరల నొకపరి ప్రదర్శింపఁబడును. ఎవరో యెచ్చటో మెచ్చిరని వ్రాయుటకంటె నేమోమోటమునులేని పండితులయెదుట నే యొకసారి వీరుపూర్వగ్రంథ ములను బరిశీలింప సభకూర్తురుగాక. ఏకపక్షవాదమున నెవరో వచ్చిరి. ఏమో పొగ డిరి, యని యెన్ని వ్రాసికొనినను నిష్ప్రయోజనము. ఆగోదావరీ మండలంబునకే చని విచారించిన నంతయుఁ దెలిసెడిని. చినమాంతాచార్యులవారు చేయించిన యేకపక్ష యజ్ఞము తత్రత్యులచే నెంతగర్హింపఁబడుచున్నది స్పష్టమయ్యెడిని. పత్రికాకార్యస్థాన ములకు విమర్శనార్థము నేకులు పుస్తకములను బంపుచుందురు. బదులుకు బదులు పంపఁబడు పత్రికలుగూడఁ బగపత్రికలయభిప్రాయము వడయఁజూచుచుండును. అట్లనేక గ్రంథములును బత్రికలును వచ్చి మాకార్యస్థానము నిండుచుండ నొకపరి పత్రికలన్నింటి మీఁదఁగూడ నభిప్రాయ మిచ్చియుంటిమి.

అది నిర్నిమిత్తమని పా॥ జిగారు వ్రాయుచున్నారు. తమ కనుకూలముగానే యుండినచో సనిమిత్తమయ్యెడిదే కాని ప్రతికూలమైనది. అస్పృశ్యతానివారణాదిమహోద్బో ధలఁజేసెడి యాంధ్రాదిపత్రికల నగ్గించితినఁట. తనపత్రిక నెగ్గించితినఁట. ఏమని యొగ్గిం చితి? పండితులఁ దిట్ట వలదని. ఇదియే నేనుజేసిన తద్దూషణము. ఆంధ్రాదిపత్రికల భూషించుట యొకతప్పు. పండితులఁ దిట్టవలదనుట మఱియొకతప్పు. అబ్బా! పా॥జి గారి కెంతతప్పులు చిక్కినవి. ఆంధ్రాదిపత్రికల నగ్గింపక తనవలెనే యొగ్గింపవలయుఁ గాఁబోలు! తన కది వ్రతము. ఈమహావ్రతమును బట్టుట కందఱకిని జేతకాదు. ఏతద్వ్ర తాచరణమువలని ఫలమేమి? ప్రతిదూషణతిరస్కారములు. ఆంధ్రాదిపత్రిక లస్పృశ్య తానివారణాదు లాచరించుఁగాక. అయ్యవి యంగీకరింపనిపండితుల నవిదూషించుటలేదు. తమపని తాము చేసికొనుచున్నవి. దూషించెనే దూడుఁడు. పా॥ జిగారు దూషించినట్లు దూషింపవు. ఈదూషణ మెవ్వరికిని జేతకానిది. ఇందు వీరికె దూషకచక్రవర్తియని బిరుద ముగూడ నీయవచ్చును. పా॥ జగారు పత్రికనుండెచ్చుకొని నన్నుఁ బడఁదిట్టుదురుగాక. అప్పుడుకా దిప్పుడు. ఎప్పటికిని బండితులఁ దిట్టవలదని బతిమాలెద. పండితులనే కాదు. పరుల నెవరినిగూడ. పా॥ జిగారికిఁ దమ్మశాంత మవలంబించి వ్రాయుఁడనియనుట యిష్టమేయఁట కాని తమకు హితోపదేశము చేసినప్రకారము నేనును వర్తింపనందులకుఁ గోపమువచ్చి నన్ను దూషింప మొదలిడిరఁట. ఆవర్తింపమి యెయ్యది? నేను జినమాం తాచార్యులవారు భాష్యములుచెప్పి తమవైదుష్యముచేఁ గొందఱ సుముఖులఁజేసికొని

ఖిలములగుచున్న ధర్మములఁ బునరుద్ధరణకుఁ బ్రయత్నించుచున్నారని భూషించుటయు నరులఁ దాంబూలచర్వణకంచుకధారణాదులు పనికిరావనియు వీరు పీఠాధిపతులమని యెంత సెనఁగులాడినను జనసామాన్యమును మీవైపునకుఁ ద్రిప్పుకొనలేరనియు దూషించితివఁట. ఇది యుచితమని బుద్ధిమంతు లనరఁట. బుద్ధిమద్వరులారా! స్వా॥ జీగా రనుట కేమి కాని యీదూషణభూషణములు పరిశీలించి యుచితానుచితములు మీరే సెలవిండు. చినమాంతాచార్యులవారు ముందెపుడో తమశిష్యులఁ బీఠాధిపతులఁగా నియమించి వ్యాజ్యెము వేయించెదమన్నారఁట కాని యింకను నాపనులు చేయలేదఁట. విరూపాక్షపీఠాధ్యక్షులు వ్యాజ్యెము వేయనే వేసి నిజాము రాజ్యమునఁగల పుష్పగిరి వారి యగ్రహారముల జప్తుచేయించిరఁట. వారింత యపకార మాచరించినను నభినవసరస్వతి జెల్లను గొట్టిన రాయివలె మిన్నకుండి శ్రీవారి కింతయాశ యేమనుకని చినమాంతాచార్యుల వారిని దూషించుచున్నదఁట.

అందుల కభినవసరస్వతిని గంగిరెద్దుతోఁ బోల్చిరి. అది తనకు మేఁతవేసినవానిని పేరింతువానియున్న ననుకూలముగాఁ దలనూఁగించునఁట. ఏమియు నీయనివాని కేమి చెప్పెదవన్నఁ గాలితో మన్ను గిలివేయునఁట. చూచితిరా స్వా॥జీగారి ప్రల్లదములు! ఎట్టిప్రల్లదము లనవరతము నాత్మానుసంధానమొనరించు లోకాతీతులఁ గలవరపెట్టకున్నను బ్రపంచముతో సంబంధముగలిగియున్న యస్మదాదుల కత్యంతతాపకరములు గాకపోవు. ధర్మాధర్మచర్చ యంతయును నస్మదాదులదే కాని ప్రపంచాతీతులకు దేని తోడను బనిలేదు. కనుక నీప్రలాపములకుఁ బ్రత్యుత్తరముగా యథార్థకథనము చేసి తీరవలయును. ఒకరి నొకరు తిట్టుకొనుటలో నెవరును వెనుదీయువారు కారనియుఁ గలహవృద్ధికరములగు నేతాదృగ్వ్యాసములఁ బ్రకటించు టనవసరమనియు నిట్టియన్యోన్య దూషణలఁ జిలకించి యన్యు లపహాసింతురనియుఁ గొందఱు పెద్దమనుష్యులు వాకొనుచున్నవారు. అయ్యది వాస్తవమే. ఈవిషయము మాకుఁ దెలియనిది కాదు. అయినను బ్రపంచసంబంధము గలిగియున్నంతవఱకు నిట్టిప్రల్లదములకుఁ గొంతవఱకైనను బదులు చెప్పకుండుట యసమర్థతాద్యోతకము. కావునఁ బ్రతివ్రాయుటకుఁ బ్రయత్నించుచున్న మన్నింపఁ బ్రార్థితులు. చినమాంతాచార్యులవారు పరిష్కృతపుష్పగిరిపీఠాధిపతుల గంగిరెద్దుతోఁ బోల్చినప్పుడు తచ్ఛిష్యులగు స్వా॥జీగారు మాయభినవసరస్వతిని దానితోఁ బోల్చుట వింతగాదు. కీరు వారియొద్దఁ జదివిన మీమాంస యియ్యది గాక మఱియెయ్యది? ప్రకరణజ్ఞానముగల పండితులకు బోధపడఁదగిన శారీరకమీమాంసాభాష్యము పంచకావ్యవ్యుత్పత్తిగూడలేని స్వా॥జీగారికి బోధపడుట దుర్లభము. పీఠాధిపతులు పరస్పర

మన్నదమ్ములవంటివారలు. అందును పుష్పగిరివిరూపాక్షపీఠాధిపతులు కేవలసహోదరులు. ఏకద్రవ్యాభిలాషులు. ఏకద్రవ్యాభిలాష ద్వేషజనకము. కావున లోకమునఁగల యెల్లరు సహోదరులతోపాటు కొంతకాలము స్నేహము గొంతకాలము విరోధమును గలిగియుందురు. అందువలన విరూపాక్షపీఠాధ్యక్షులు పుష్పగిరివారిపై వాజ్యము వేసి నిజాంరాజ్యమునఁగల వారియగ్రహారములు రెండు జప్తుచేయించిరి. తద్రాజ్యస్వభావమును బట్టి యప్పని సులభముగా జరిగినది. ఉభయులకును న్యాయస్థానముల వాదోపవాదములు నడచుచున్నవి. అంతియేకాని విరూపాక్షపీఠాధ్యక్షులు చినమాంతాచార్యులవారి వలె శ్రీముఖములు ప్రచురించుట లేదు. పుష్పగిరివారినిగాని తత్సంబంధులనుగాని తెగఁదిట్టుట లేదు.

అట్టి పట్ల నభినవసరస్వతిగాని యన్యులుగాని యన్యాయముగా విరూపాక్షము వారి తెరు వెందులకుఁ బోవలసియుండును? చినమాంతాచార్యులవారును పుష్పగిరివారిపై వ్యాజ్యము వేయించి కోర్టులకెక్కి కొట్లాడకుండ నెవరు వలదనిరి? దానికిఁ జేతిగాక నోరున్నదికదా యని పుష్పగిరివారిని దెగఁదిట్ట నారంభించిన వారికెట్టి శునకారావములు లెక్కలేక యూరకున్నను శిష్యులెట్లూరకుందురు? చినమాంతాచార్యులవారి శ్రీముఖములకభినవసరస్వతి యొక్కటియే బదులు వ్రాసినదా? దేశజను లనేకులు వ్రాసిరి. దేశగురువులఁదిట్టినప్పుడు దేశజను లెట్లూరకుందురు? లక్షలరూపాయల యాదాయముఁగల పుష్పగిరివారిపై వ్యాజ్యము వేయించుటకుఁ జినమాంతాచార్యులకు వేలరూపాయలు కావలసివచ్చినవి. అందులకుఁ బరానందభారతులకుఁ బట్టాభిషేకము గావించి వారి పేరుమీఁదనే పాపరుదావా నడపుటకుఁ బ్రయత్నించిరి. కానివారు పెన్షనుదారు లగు కతంబున నది చెల్లనేరదయ్యెను. పరానందభారతులు ప్రాక్తనాశ్రమమున రిపిన్యూ యిన్స్పెక్టరులు. ఇంటిపేరు తల్లావజ్ఝలవారు. పేరు గంగాధరశాస్త్రిలు. వారికిని వారి రెండవభార్యకును వైరము సంభవించుటవలన సన్యాసము దీసికొనిరి. అదృష్టవశమునఁ దచ్ఛిష్యీకరణమునకుఁ జినమాంతాచార్యులవారే సిద్ధించిరి. చాలకాలము రాజకీయకార్యభారవాహకులై తరువాత ధర్మపత్నితోఁ దగవులాడలేక ప్రపంచమును రోసియే సన్యసించిరి కాని సన్యాసముదీసికొన్నను గాడిదెబరువు తప్పలే దనుసామెతగా రాజకీయకార్యభరము వహింపవలసియే వచ్చినది. ఇదియంతయుఁ జినమాంతాచార్యులవారి ప్రసాదము. శ్రీవారు శ్రీశృంగేరివిరూపాక్షసంస్థాన శ్రీపీఠసామ్రాజ్యమునకుఁ బట్టభద్రులై పుత్రునకుఁ బుష్పగిరిపీఠసామ్రాజ్యమునఁ బట్టాభిషేకము గావించిరి. అట్టిశిష్యునకుఁ బుష్పగిరిపీఠపుటాస్తి వచ్చుట యెట్లున్నను ముందు పెన్షనునకుఁ బాసిపోఁగలఁడని

పాపరుదావా మానుకొని ప్రస్తుతము పరుని పేరుతో సివిలుదావా నడుపుటకుఁ బ్రయత్నించుచున్నవారు. శ్లో॥ యత్నే కృతే యది న సిధ్యతి కోఽత్ర దోషః॥ అయ్యది సమంజసమే. మహారాజువలె వ్యాజ్యము వేయింపవచ్చును. పుష్పగిరిపీఠపుటాస్తి వచ్చిన భోగింపవచ్చును. శ్రీముఖము లను పేరఁ బుష్పగిరివారిని జెడఁబడదిట్టుటయు వారికిని వారి శిష్యులగు పండితప్రకాండులకును బహిష్కారములని విధించుటయునే పనికిరానిది. అందులకే యందఱును దిరుగఁబడుట. తన్మూలములే బహిరంగలేఖలు. గ్రంథవిస్తరభీతిని దద్బహిరంగలేఖలఁ బ్రకృతము ప్రచురింపమానితిని. వీలైన వేఱొకపఱి ప్రకటింపఁబడును.

అందఱిలో నభినవసరస్వతియు నొక్కటిగాని పుష్పగిరి వారిపక్షమున దిగి చినమాంతాచార్యులఁ దిట్టుచున్న వారిచ్చెడిది వారికియ్యరనియు విరూపాక్షమువారిని దూషించిన వారిచ్చెడిది యెగఁబెట్టెదరనియుఁ దలంచెడిది కాదు. పుష్పగిరివిరూపాక్షపీఠాధిపతులపై దానికిఁగల గురుత్వము పోషకత్వపురస్సరము కాదు. జగద్గురుత్వపురస్సరము. పోషకు లనేకు లున్నవారు. వారిలో వీరు నొకరు. ధర్మమునకుఁ బాటుపడుటయే దానికిఁ గావలసినది కాని పోషకుల నెల్లరం బూసివేసికొని పోవలసిన యవసర మెంతమాత్రమును లేదు. అట్లుకాక యిచ్చెడియిరువదియైదురూపాయలు నెగవేతురనియే యభినవసరస్వతి పుష్పగిరివిరూపాక్షపీఠాధ్యక్షుల కనుకూలముగా వ్రాయుచున్నదని యనుకొందము. చినమాంతాచార్యులవారి శ్రీముఖములకు బదులువ్రాసిన గుంటూరుప్రముఖగ్రామస్థుల కందఱికి నేమియిచ్చుచున్నారు? వారందఱును బుష్పగిరివారిమీఁద వ్యాజ్యము వేసి నిజాము రాజ్యమునఁగల యగ్రహారముల జప్తుఁజేయించిన విరూపాక్షము వారిమీఁది కేల దాడివెడలకుండిరి? ఇఁక నెందుల కభినవసరస్వతిని గంగిరెద్దుతోఁ బోల్చి ప్రల్లదములు విలిఖింపవలసివచ్చినది? కావున నిదియంతయు నధికప్రసంగమని యందఱును గుర్తెఱుంగుదురుగాక? మఱియు విరూపాక్షపుష్పగిరిపీఠాధిపతు లభినవసరస్వతికిఁ బ్రతివత్సరము నింతయో యంతయో యిచ్చుచున్నందునఁ దత్కృతజ్ఞత చూపుటగూడ దోషము కాదు. కృతఘ్నత కూడదు కాని కృతజ్ఞత చూపవలసినదే. ఆఱువందలరూపాయలు నొక్కమాఱె యొసంగినపుష్పగిరివారిపైఁ గృతజ్ఞతలేక కృతఘ్నుఁడగుటకుఁ బా॥జీ గారికిఁ దగుఁ గాని యేరికిఁ దగును? వీరు తాము బుష్పగిరిపీఠాధిపతుల మహారాజపోషకులుగాఁ బ్రచురించుకొనుచున్నవారు. వారిదృష్టికిఁ బ్రకృతపుష్పగిరిపీఠాధిపతులు పరానందభారతీస్వాములవారు. తమరు మాపుష్పగిరిపీఠాధిపతులకును మల్లాది రామకృష్ణవిద్వచ్ఛయనులు గొల్లపూడి లక్ష్మణసోమయాజులు కప్పగంతు

సీతారామచయనులు దెందుకూరి నరసింహశాస్త్రిగార్లను బహిష్కరించినతరువాతఁ దత్పారితోషికముగా వేమూరి శివస్వామిశాస్త్రిగారు గోదావరిజిల్లాయంతయు నగ్రహారముగా నొసంగిన ట్లాపరానందభారతులకుఁ జినమాంతాచార్యులవారు తత్పుష్పగిరిపీఠాధిపత్యము రిజిష్టరుకూడఁ జేసియిచ్చియున్నారు.

కనుకఁ జినమాంతాచార్యులపక్షమున జిగి నునుబోంట్లనందఱం జేడఁబడఁ దిట్టుటయు నింద్రులు చంద్రులని వారిని భూషించుటయుఁ దత్పుష్పగిరిపీఠాధిప ప్రభువుల సాహాయ్య మపేక్షించియేయైయుండవలయును. అర్థాపేక్షతో నిట్టి పత్రికాంతరలు వ్రాయ నలవాటుపడినవారగుటచేతనే మావిగాదెంగూడఁ దదారోపణ చేయుచున్నారు. శ్లో॥ ఆత్మవన్మన్యతే జగత్॥ లోకముతనవలెనే యన్యులును బ్రవర్తింతురని తలంచును. పుష్పగిరిపీఠాధిపతులను దదధికారులను దత్సంబంధులను రామకృష్ణచయనులవారిని లక్ష్మణసోమయాజిగారిని లక్ష్మీనారాయణశాస్త్రిని నన్నుఁ గుంటూరుప్రముఖానేక గ్రామవాస్తవ్యులను దిట్టితిట్టి పా॥ జిగారిప్పటి కుపసంహారమున కుపక్రమించిరి. అబ్బా! వీరి సంహార మెంతకాలమునకుఁ గనుగొంటిమి! అనన్వయాదిదోషభూయిష్టమును నసంగతార్థబోధకమును నగు శిరశ్శృంగేరీ శిరవిరూపాక్షసంస్థాన శ్రీపత్రము "వంధ్యాసూను స్సమాయాతి ఖపుష్పకృతశేఖరః కూర్మక్షీరకృతాహార శ్శశశృంగధనుర్ధర" యను శ్లోకములోనియర్థమును స్ఫురింపఁజేసెడిదేకాని యన్యముకాదు. పరిష్కృతపుష్పగిరిపీఠాధిపతులు తక్కటిపీఠాధిపతులుంబోలెఁ దత్కాలోచితధ్ధంగిఁ వీర మధిష్ఠించిరి. విజయవాడయతులు నియమవిధిమాత్రబోధకులేకాని మంత్రోపదేశకులు కారు. ఈసంగతి వారి ముఖవచనమువలననే తెలియవచ్చెడిని. పీఠ మరాజకము గాకుండ నుండఁదగిన యోజనచేసిన దివానుగారు శ్లాఘాపాత్రులే కాని నిందాపాత్రులు కారు. కల్యాణానందభారతి యపూర్వపేరమే కలికాలపుదికాని యియ్యది కాదు. వీరి యంతకత్వమును వీరుచేసెడి కార్యమును గుంటూరు పౌరులు ప్రకటించిన కరపత్రములే చెప్పుచున్నవి. నోటికివచ్చినట్లు వాగుటయుఁ జేతికివచ్చినట్లు వ్రాయుటయుఁ బండతేతరులగు పా॥ జిగారిపనికాని పండితులది కాదు. ఇఁక నిట్టి దూషణవ్యాసములఁ బ్రకటింపక పా॥ జిగారు భద్రముగాఁ బ్రవర్తింతురుగాక! పాదరక్షాప్రయోగములకు బాహ్యులు గాకుందురుగాక! వ్యాసాద్యంతముల సత్యమేవ జయతే నానృత మ్మను బొల్లు పాట పాడకుందురుగాక! అసత్యలేఖకున కదియే నెత్తి గొట్టఁగలదు. తథాస్తు!

——(:o.)——

# అస్పృశ్యతా నిరాకరణఖండనము.

శ్లో॥ వర్ణాశ్రమవ్యవస్థాత్రే ధర్మైకహేతవే
సర్వాధీసాక్షిభూతాయ శ్రీకృష్ణాయ నమోనమః॥

శ్లో॥ శ్రుతిస్మృతిపురాణానా మాకరాయ దయాళవే
ధర్మస్థాపనదక్షాయ శంకరాయ నమోనమః॥

ఆలమూరులో నీయఁబడిన **యధ్యక్షోపన్యాసము**ను ఖండించుచు నేను వ్యాసముఁ వ్రాసియుంటిని. దాని ఖండించుచు దమవాదమును బలపఱచుచు శ్రీ కావ్యకంఠ గణపతి శాస్త్రిలుగారు ప్రకటించిన వ్యాసమును నేనుజదివితిని. ఉభయులవాదములు పత్రికాద్వారమునఁ బ్రకటితములయినవి గనుకఁ బాఠకులు సత్యాసత్యములు గ్రహింతురు. వాదప్రతివాదములతోఁ బత్రికలనింపుట భావ్యముకాదని యుపేక్షించియుంటిని. కొందఱు నా స్నేహితులు వారిఖండనవ్యాసములోని కొన్నియంశములకైనను సమాధానము వ్రాయనియెడల సనాతనధర్మనిరతులు నిజముగ్రహింపఁజాలరని ప్రోత్సాహపఱచినందున సంక్షేపముగా వ్రాయఁబూనితిని. దయతోదీనిఁ బఠింప వేఁడుచున్నాను.

ప్రపంచమున నెవ్వరేని మీవాదము న్యాయ్యముకాదని పరులు సప్రమాణముగ నిరూపించినను దాని ఖండింపఁబూనువారేకాని గుణము గ్రహించి తమయభిప్రాయమును మార్చుకొనువార లిప్పుడు కనుపించరు. మండనపండితాదులు పూర్వకాలమున నుండిరని చెప్పుదురు కాని మధ్యస్థులకుమాత్రము సత్యాసత్యములు కొంతవఱకు స్ఫురింపక మానవు. ఇదియే వ్యాసలేఖనమునకుఁ బ్రయోజనము.

చండాలత్వ మవయవసన్ని వేశగా బ్రాహ్మ్యజాతికాదు. బ్రాహ్మణత్వాదిజాతులవలె శ్రుతిస్మృతిప్రసిద్ధము. తద్ద్వారమున లో[illegible]సిద్ధము. ప్రతివ్యక్తులయం దీజాతి యుండుననఁగా వివాహితయగు [illegible]ణ స్త్రీయందుఁ దద్భర్తయగు బ్రాహ్మణునివలనఁ బుట్టినవానియందు బ్రాహ్మణత్వముండినట్లు బ్రాహ్మణస్త్రీయందు శూద్రుని వలనఁ జన్మించిన వానియందునను దద్వంశ్యులందునను జండాలత్వజాతి యుండునని మహర్షులు స్మృతులలోఁ జెప్పిరి. తద్ద్వారమున లోకమందుఁగల ప్రసిద్ధినిబట్టి చండాలుర నెఱుంగునది చండాలత్వసంశయముగలిగినప్పుడు బహిర్గ్రామప్రతిశ్రయ సర్వధర్మబహిష్కృతత్వాదులఁబట్టి యనుమానము చేయవచ్చును. బ్రాహ్మణస్త్రీయందు శూద్రునివలనఁబుట్టినవాఁడు తల్లి జాతిలోననైను దండ్రిజాతిలోనైనను జేరునని వీరు సూచించిరి. మఱియాశ్రమములోని కొన్ని జాతుల నుదాహరణముగానిచ్చిరి.

అనులోమసంకరులలోఁ దల్లిజాతితోఁ బోలియుండుటయు నెకప్పుడు తల్లిజాతికంటె నుత్కృష్టుండగానుండుటయుఁ గలదు. అట్టితారతమ్యములను జెప్పుటకు శాస్త్రమే ప్రమాణము. ప్రతిలోమసంకరులును దద్వంశ్యులును దల్లితండ్రికులములలోఁ జేరక వారికంటె హీనులగు సంకీర్ణు లగుచున్నారనియే మనుస్మృతి చెప్పుచున్నది. గుఱ్ఱమునకు గర్దభమునకుఁ బుట్టినది రాసభము (కంచరగాడిద) దానిపరంపరలోఁ బుట్టినది రాసభమే యగునుగాని గర్దభముగాదు. గుఱ్ఱమును గాదు ఇది లోకానుభవము మనుస్మృతి ॥అ॥ 10॥ శ్లో॥ యథైవశూద్రో బ్రాహ్మణ్యాం బాహ్యం జంతుం ప్రసూయతే। తథా బాహ్యతరం బాహ్యశ్చాతుర్వర్ణ్యే ప్రసూయతే । శూద్రుండు బ్రాహ్మణస్త్రీయందు బాహ్యుఁడగు చండాలుని గనినట్లు చండాలుఁడు చాతుర్వర్ణ్యస్త్రీలయందును నంతకంటెహీనుని గనును. దీనినిబట్టి చండాలవంశోత్పన్నులు

నిరవసితశూద్రుఁడని వ్యాకరణమహాభాష్యమునఁ జెప్పఁబడినది. నిరవసితశూద్రులకు సమాహారద్వంద్వసమాసము రాదు. చండాలమృతపా యని యుదాహరణము. అనిరవసితశూద్రులకు సమాహారద్వంద్వసమాసము వచ్చును. తక్షాయస్కారమని యుదాహరణము. ఇక్కడఁ దక్షాయస్కారులు శూద్రులలోఁ బరిగణింపఁబడుటవలనను జండాలమృతపులు నిరవసితశూద్రులుగాఁ బరిగణింపఁబడుటచేసియు శూద్రపదము త్రైవర్ణికేతరమనుష్యమాత్రవాచకమని తత్త్వబోధినీకారులు వ్రాసినవ్రాఁతె సప్రమాణము. తక్షయనఁగా రథకారుఁడు. అతఁడు సంకీర్ణుఁడు. రథకారస్తు మాహిష్యాత్కరణ్యాం యస్య సంభవ యని స్మృతులందును నమరమందును గలదు. చండాలమృతపులును స్మృతిప్రమాణముచే సంకీర్ణులే కనుక యీసూత్రములోని శూద్రపదము వలనఁ జండాలురు నిరవసితశూద్రులనుటకు వలనుపడదు.

దీనికి శ్రీశాస్త్రులు గారి ప్రత్యుత్తరము "చండాలురు శూద్రులలోఁ జేరనియెడల సూత్రము శూద్రాణామనియుండినఁ జాలును. దానిచేతనే తక్షాయస్కారరూపము సిద్ధించును. అర్ధమాత్రాలాఘవం పుత్రోత్సవం మన్యంతే వైయాకరణా యని న్యాయము. మితాక్షరములలో నర్థమిముడుట వైయాకరణుల కిష్టమనికదా దీనిభావము. ఒకవేళఁ "దక్షయనఁగా సంకీర్ణుఁడు-వానిసంగ్రహించుటకై శూద్రశబ్దము లక్షణచే సంకీర్ణునిజెప్పును. అప్పుడు చండాలమృతపా యనురూపసిద్ధికై యనిరవసితానా మనువిశేషణ ముండవలె"నని యనియెదరేమో యది సరికాదు. రథకారులు ముగ్గురుఁ ద్రైవర్ణికులలోనివారే-కర్మవైగుణ్యముచే రథములఁజేయుచు రథకారుఁడని వాడఁబడువాఁ డొకఁడు-ఇతఁ డాధానాధికారిగా శాస్త్రమందుఁ జెప్పఁబడెను. రథకారస్తు మాహిష్యాత్ కరణ్యాం యస్య సంభవ యనిచెప్పఁ బడిన సంకీర్ణుఁడు రెండవవాఁడు-తక్షాతు వర్ధకి స్త్వష్టా రథకారశ్చ కాష్ఠత

ట్టని చెప్పఁబడినరథకారుఁడు మూఁడవవాఁడు. తక్షాయస్కారమని యుదహరింపఁబడిన తక్షయునురథకారుఁ డయస్కారుఁడును జాతి శూద్రుఁడును గనుక శూద్రాణా మని సూత్రింపఁబడినవాఁడుకును. చండాలును శూద్రులుగనుకనే వారికి సమాహారద్వంద్వము రాకుండుటకై యనిరవసితానామని విశేషణము వేయఁబడినది. ఇద్దఱు రథకారులుండుటచేతనే యమరకోశశూద్రవర్గమున రథకారస్తుమాహిష్యాత్ కరణ్యాం యస్య సంభవ యని సంకీర్ణరథకారుని జెప్పినది-కొన్ని శ్లోకములకుఁబైని దక్షాతు వర్ధకి స్త్వష్టా రథకారశ్చ కాష్ఠతక్షని జాతిశూద్రులలోఁజేరిన రథకారుని జెప్పినది-ఇటులనే చండాలురు నిద్దఱుకలరు-స్యాచ్చండాలస్తుజః శూద్రా బ్రాహ్మణ్యాం వృషలేన యః॥ శూద్రునివలన బ్రాహ్మణస్త్రీయందుఁ బుట్టినవాఁ డాచండాలాత్తు సకీర్ణాయని యుండుటంజేసి సంకీర్ణచండాలుఁడు తర్వాతఁగొన్ని శ్లోకములకుఁబైని జండాలప్లవమాతంగదివాకీర్తిజనంగమాః। నిషాదశ్వపచా వంతేవాసి చాండాలపుల్కసాయని చెప్పఁబడిన చండాలురు నిరవసితశూద్రులు గనుకఁ దక్షయుఁ జండాలుఁడును సంకీర్ణులు కారు. పాణినిసూత్రప్రకారము తక్షయునిరవసిత శూద్రుఁడు-చండాలుఁడు నిరవసితశూద్రుఁడు-అట్టిచండాలురను స్పృశించుట దోషావహము కాదని.

త్రైవర్ణికులలోనివాఁడు కర్మనైపుణ్యముచే రథములఁ జేయుచు రథకారుఁడని చెప్పఁబడును. వానికే యాధానము విధింపఁబడినదని వీరు చెప్పినది తప్పు-శాస్త్రవిరుద్ధము. ఈసంగతి తేటపడుటకై మీమాంసా జైమినీసూత్రశాబరభాష్యములు నుదాహరించుచున్నాము. జై॥అ॥6॥ సూ॥ 50॥ సౌధన్వనాస్తుహీనత్వా న్మంత్రవర్ణా త్ప్రతీయేరన్॥ భా॥ నతుసర్వఏవా త్రైవర్ణికో రథకారః। సౌధన్వనా ఇత్యేష జాతివచన శ్శబ్దః సౌధన్వనానామ జాతి రభిధీయతే హీనాస్తు కించిత్త్రైవర్ణికేభ్యః జాత్యంతరం. నతు శూద్రాః నవైశ్యాః నక్షత్రియాః తేషామిదమాధా

నం కథమవగమ్యతే ప్రసిద్ధేర్మంత్రవర్ణాచ్చ. మంత్రవర్ణోహి భవతి సౌధన్వనా ఋభవ స్సూరచక్షుష ఇతి ఋభూణాం త్వేతి రథకారస్యాధానమంత్రః. ఋభవశ్చ రథకారాః. అపిచ నేమిం నమయంతి ఋభవో యథా ఇతి యే నేమిం నమయంతి తే ఋభవ ఇత్యుచ్యంతే. రథకారాశ్చ నేమిం నమయంతి తస్మాన త్రైవర్ణికానాం నశూద్రాణా మేష ఆధానం.

ఆధానాధికారియగు రథకారుఁడు త్రైవర్ణికుఁడు కాఁడు శూద్రుఁడుఁ గాఁడు జాత్యంతరుఁడనినప్పుడు ఆ జాతికిని స్వతంత్రజాతి లేనందున సంకీర్ణుఁడే రథకారుఁడని స్పష్టపడినది. త్రైవర్ణికులలోనివాఁడే కర్మవైగుణ్యముచే రథములఁ జెక్కుచు రథకారుఁడని వాడఁబడిన యెడల జాత్యంతరమను మాట వర్తించదు.

జైమినీయ న్యాయమాలయందు "విప్రాదికేన రథకృ దన్యోఽపి దోస్తు యోగతః, రూఢే ర్వర్ణాంతరం తస్యాధానే పర్యవసీయతే" అని రథకారశబ్దము సంకీర్ణ వర్ణాంతరమును రూఢము. అతఁడే యాధానాధికారియని చెప్పఁబడినది. దానివ్యాఖ్యయందు "శూద్రాణాం వైశ్యా దుత్పన్నా కరణీ తస్యాం కరణ్యాం మాహిష్యా దుత్పన్నో రథకారః తథాచ యాజ్ఞవల్క్యః మాహిష్యేణ కరణ్యాంతు రథకారః ప్రజాయతే ఇతి" అని కరణియందు మాహిష్యునివలనఁ బుట్టినవాఁడే రథకారుఁడని చెప్పఁబడినది. ఇట్టుల మీమాంసాశాస్త్రము చెప్పుచుండ యథేష్టముగాఁ ద్వైవర్ణికులలోనివాఁడే రథకారుఁడని చెప్పి శాస్త్రజ్ఞానము లేని వారికి భ్రమపెట్టిన యెడల దోషము ఘటించును.

మొదటి రథకారుఁడు విచారింపఁగా సంధ్యాపుత్రుఁడాయెను. రెండవ సంకీర్ణ రథకారుఁడే శ్రుతిస్మృతి లోకప్రసిద్ధుఁడు ఇతఁడే యాధానాధికారి, ఈజాతివారికే యుపనయనాది వైదికసంస్కారములు ఇప్పటికి నన్ని దేశములలో జరుగుచున్నవి. కొన్ని సంవత్సరములక్రింద రథకారులు "మేము బ్రాహ్మణులము, మాకు యాజనాద్యధికారము గల" దని గుంటూరుకోర్టులో దావా చేయఁగా సబ్ కోర్టు వారు "నాదిప్రతి

వాసుల ప్రమాణగ్రంథములఁ జక్కఁగాఁ బరిశీలించి రథకారులు సంకీర్ణవంశ్యులే. వీరికి ఉపనయనాదులుగలవు. యాజనాద్యధికారములు లేవు. వీరు చాతుర్వర్ణ్యములోనివారు కారని తీర్మానించిరి. ఇదియంతయు స్వర్ణకారవ్యవహారమను నొకగ్రంథరూపమున ముద్రితమైయున్నది.

ఇంక నమరకోశమందు సంకీర్ణుఁడగు రథకారుని జెప్పి కొన్నిశ్లోకముల కనంతరము తక్షాతు వర్ధకి స్త్వష్టా రథకారస్తు కాష్ఠతట్టని చెప్పఁబడిన రథకారులు శూద్రులని వీరు చెప్పిరి.

తక్షాతు వర్ధకి స్త్వష్టాయను నమరశ్లోకము రథకారత్వజాత్యవచ్ఛిన్నుని జెప్పుటకుఁ బ్రవర్తించినది కాని కేవల యౌగికార్థమును జెప్పుటకుఁ బ్రవర్తింపలేదు. ఈసంగతిని శాస్త్రులుగారు కూడ నంగీకరించక తీరదు. శూద్రాణ్యామనసూత్రోదాహరణమున దక్షుని శూద్రుఁడని గ్రహించుటెట్లు? యౌగికమైనయెడలఁ గట్టెయుజెక్కు వృత్తిమనుజుఁడును దక్షుఁ డనఁబడవచ్చును గనుక రథకారశబ్దము శ్రుతిస్మృతిలోకవ్యవహారమూలమున నెవ్వనియందు రూఢమో వాఁడు రథకారుఁడు. శ్రుతిస్మృతులందు సంకీర్ణునియందే రథకారశబ్దము వాడఁబడినది. తన్మూలక లోకవ్యవహారసిద్ధ రథకారశబ్దమును దత్పర్యాయములను ననుసరించుచు వ్యవహారార్థము ఉదాహరించెను. శ్రుతిస్మృతులందిద్దఱురథకారులెక్కడను జెప్పఁబడలేదు. ఇట్టిరథకారుని నిరూపించుటకు నిఘంటుకారునకధికారము లేదు. నిఘంటువు ధర్మశాస్త్రముకాదు. శ్రుతిప్రసిద్ధములగు జుహూపభృత్ప్రభృతులలోకులకుఁ దెలియఁజేయుటకై చెప్పినట్లు శ్రుతిస్మృతిప్రసిద్ధములగు తక్షరథకారాదిశబ్దములను జెప్పినది. దీనినిబట్టి సంకీర్ణరథకారుఁడొకఁడు శూద్రరథకారుఁడు మఱియొకఁడుఁ గలఁడని భ్రమింప నక్కఱలేదు. ఇంక రథకారుఁ డొక్కఁడే యయిన యెడల సంకీర్ణరథకారుని జెప్పి తర్వాత మఱికొన్నినామములఁ జెప్పి యనంతరము తక్షాతు వర్ధకి స్త్వష్టా రథకారస్తు కాష్ఠతట్టని తత్పర్యాయముల వేఱుగాఁ జెప్పనేల యని యందురేమో!

## —• శుక్లతీర్థ మాహాత్మ్యము. •—

ఆ॥ అట్టిమహిమయునొకటి యచ్చోటనుండెడు శుక్లతీర్థమనఁగ శోభిలుచును,
దత్తనలస్థశుక్లదర్భలచే నద్ది యెఱుఁగఁబడెడిఁ, బ్రజల కిప్పటికిని, ౨౧౯

వ॥ తొల్లి చమత్కారపురంబున శిల్పవిదగ్రగణ్యుండగు శుద్ధకాభిధాన రజకుండు స్వవర్ణంబునం బ్రాధాన్యంబు వహియించి ముఖ్యబ్రాహ్మణులయంబరంబుల శోధించుచుఁ బుత్రపౌత్రసమన్వితంబుగాఁ బోలుపారుచుండియుఁ గొంతకాలంబునకు భూసురశ్రేష్ఠుల వసనంబులు ప్రమాదవశంబున నీలితొట్టిలోమునుచుట సంభవించెఁ, దుదకు మందచిత్తుఁడగు వాఁడది యెఱింగి భయంబున స్వకుటుంబినిం దనయులను రహస్యంబు నరుఁజీటె ౨౨౦

ఉత్సాహము॥ భాగ్యవంతులైనయట్టి బాపనయ్య లెందఱో
యోగ్యమైనయట్టివలువ లుతుకవేసియుండ నే
నాగ్యశత నీలితొట్టిఁ బట్టి పెట్టినాఁడ నే,
మ్యగ్యసమ్యె వెరవు వారి మెచ్చఁజెప్ప నింకిటన్ ? ౨౨౧

తే॥ తెల్లవారినతోడనే తెలిసివారు కట్టి కొట్టుదురో లేక కాలుపురికి
యనుపయత్నింతురో యేమొ, యందువలనఁ గడపియీరాత్రి యెటకేని నడువవలయు॥

వ॥ అని నిర్ణయించి యింటఁగల సొంబంతయు మూటలుగట్టించి భయమ్మున సకుటుంబంబుగాఁ బయనమగుటయు వానికాంతయుదాశసంభవయగు స్నేహితురాలిని సమీపించి ౨౨౩

సీ॥ "నాకునీకును జిన్ననాఁటినుండియునున్న సౌహృదపదీనంపుఁ జనవువలన
యుక్తమయుక్తంబు నూహింపఁగాలేక చపలమగు చిన్నతనమువలన
నాటపాటలలోన నాకస్మికంబుగాఁ గలుగుమండెటి మేటియలుకవలన
నేనియో యొక క్షుద్రహేతువుచేఁ బుట్టునెనసి వర్థిల్లెడి యీర్ష్యవలనఁ
దెలిసి తెలియక నీను గలికిరో ! నీతోడ నాడరానిమాటలాడియున్న
మదినిబెట్టకవ్వి మన్నింపనమ్మ సంబంధ మింతతోడఁ బాసెమనకు" ౨౨౪

వ॥ అనిచెప్పుటయుఁ గనులవెంట నీళ్ళు గార్చుచు నావిడ యేలయిట్లుపలికెద వన వెండియు నాచాఁకలిది యిట్లనియె,

తే॥ "అంబుజాక్షిరో ! మాయయ్య యాదమఱచి బాపనయ్యల వెలగల బట్టలెల్ల
నీలితొట్టినిబడవైచి జేలమగుచు నెదియుఁదోఁపక కూర్చుండె నేమనందు? ౨౨౫

ఆ॥ తెల్లవారనేని దెలిసి యాబ్రాహ్మణుల్ కఠినశిక్ష చేయఁగలరటంచు
సహకుటుంబముగను జనుటకు నన్యత్రి పయనమైనవాఁడు బాల్యసఖిరో ! ౨౨౬

క॥ కావున నే నినుఁ గనుగొన వేవేగమ వచ్చియుంటి, వినిచితి నఖిలం,
బోవిశ్వాసనిధానమ ! యీ వానతియిచ్చిపంపు మేగెద నింకన్ ౨౨౮

వ॥ అనియిట్లుపలుకుటయుఁ బల్లెవాండ్రపిల్ల ప్రసన్నవదనయై ౨౨౯

ఆ॥ "ఇట్టులైనయెడల నిందీవరాక్షిరో ! సగ నేగుమీవు సదనమునకు,
నేగి నీదుతండ్రి నెచటికిం జనకుండ బలిమి నాపు, మీ విపత్తు తొలఁగు, ౩౦౨

ఆ॥ ఈప్రదేశమునకు నీశాన్యదిక్కునుండు నీటికెంపి కొక్కనాఁడు
చేత వల గ్రహించి చేఁపలఁబట్టంగఁ జనియె నాదు తండ్రి సంతసమున, ౨౩౧

క॥ చని మెల్ల నల్లవెండ్రుకలను నల్లఁగఁబడుటఁజేసి లలితంబగుచున్
దనరెడివల నటనిడి యిటు కనుగొనుటయుఁ దెల్లదగుచుఁ గనుపించె సఖీ ! ౨౩౨

ఉ॥ అబ్బురమంది తత్క్షణమ యందుఁ గుతూహలియై మునుంగుచున్
మబ్బుఁ ద్రుణీకరింపఁగల మాయయ దేహము తెల్లనయ్యెఁబో,
గుబ్బెత లీసడింతురను కుందొక టుద్భవమందునట్లుగా
సబ్బునఁబూసినట్లు తెలచాయవహించెను దచ్ఛిరోజముల్, ౨౩౩

శా॥ నాఁటంగోలె నొకండుగూడ మతి యోనాళీకపత్రాక్షి ! య
చ్చోటం గ్రుంకఁడ, యేరికేమొయిక యాచోద్యంపునీర్లెంకి ? నా
మాటన్ దాటక వేగ నేగి యొకకోమా టట్టె నైకత్తి యా
నీటన్ మూటకుమూటు వేయునను తన్నీలత్వ మెట్లుండునో" ౨౩౪

వ॥ అనివాక్రుచ్చుటయు నది ప్రహృష్టవదనయై తత్క్షణంబ వని తండ్రికిట్లనియె

ఉ॥ "నాసఖియోర్తె చెప్పినది నాయన! నాతిసమీపభూమిలో
భాసిలుచుండెనంట యొకపల్వల మందున నేనివైచినన్
బూసినమొల్లపూవవలెఁ బూత్రిగ శ్వేతిమఁదాల్చునంట, యీ
గాసియిఁకేల ? పోయి యుదుకందగుఁ బ్రొద్దున వల్వలన్నియున్" ౨౩౫

వ॥ అనవుడు రజకుండు ౨౩౬

తే॥ వలువకంటినయట్టి యూనలుపుపోక కలుగ దెన్నటికింగూడ నిలఁ గుమారి !
పలికియుండిరి పెద్ద లీలలిని దొల్లి, వినుమువాక్రుత్తునిపుడు తద్వ్యథమునీకు, ౨౩౭

సీ॥ వజ్రపుంగునక పల్వరుస లగగరుద్ది పూసిన గంధపుం బూఁతపట్టు
యుక్త మయుక్తంబు నూహింపఁగాలేక చరియించుచుండెడి మొఱకుపట్టు
శిలకుసదృశమా చిత్తంబుతోఁగూడి పరుకట్ట మెఱుఁగని పడఁతిపట్టు
సలిలపూరితమైన బిలమునందువసించు కఱకుకొండుల యెండ్రకాయపట్టు

స్వాపదనుగుర్తయుంగని చేఁపపట్టు బుద్ధిహీనవ్రతమను త్రాగుఁబోతుపట్టు
మేలిరకపుదియైన యానీలిపట్టు కొక్కెపట్టు, విడిపింపనోపఁ డెవఁడు" ౨౩౯

వ॥ అనిపలుకుటయుఁ గన్యయిట్లనియె, ౨౪౦

ఉ॥ "పుట్టము లెల్ల నోసికొని పోవుద మచ్చటికి, కందులోపలన్
బెట్టి పరీక్ష సేయుదము, పేర్చుచు చెప్పిన చొప్పదప్ప కా
బట్టలు నీలికప్పువిడఁ బర్వునవత్తము వెండి, లేనిచో
నట్టె దిగంతరంబులకు హాయనియేగుద, మేల లెమ్మిఁకన్ ౨౪౧

వ॥ నావుడు సంశయాత్మతం బల్లెవాండ్రుపిల్లను ముందిడుకొని రాత్రియందు నిజవిభవంబుతో నం దరుగుటయు నాదాశకన్య బహువీరుధసంఛన్నంబును దేహులకు దుష్ప్రవేశంబును నగు జలాశయంబును జూపించె, నంత నానాఁకలి వసనంబుల నానిట జాడించుటయు స్ఫటికాభంబులయ్యెఁ, బదఁపడి యతండు సంతుష్టచిత్తుండై యంశుకంబుల భూసురులకుఁ దీసికొనిపోయి సమర్పించె, నంత నయ్యగ్రహారికులాయంశుకంబులయు రజకునియు ధావళ్యముం దిలకించి మార్తినుపడి ౨౪౨

తే॥ "ఏమియాశ్చర్య మీబట్టలివ్విధమున మల్లెపూవులవలెఁ గడుం దెల్లనయ్యె?
నీదు తలవెండ్రుకలుగూడ నిరుపమాన ధవళిమం దాల్చె, నెట్లుఁగియున్న వివరింపు

వ॥ అనియడుగుటయు రజకుండిట్లనియె, ౨౪౩

ఉ॥ "ఈవసనంబులన్నియును నేఁ బొరపాటున నీలికుండిలో
వైవఁ దటస్థమౌటయును వానికి నీలిమ యూనరించె 'మా
దోవతు లెల్లఁజేసితివి నూఱ్ఱ!' యటంచును గట్టి మీరు నా
పేర్వులుతీతురంచుఁ గడు భీతిలి పాఱఁగ నుద్యమించితిన్, ౨౪౪

ఉ॥ అయ్యెడ నాదుబిడ్డ తఁ యాళిని దాశతనూభనం దమిన్
జయ్యన డాయఁబోయి "మనసఖ్యముకోరెను నేఁటితోడ" నం
చెయ్యవొ చెప్పిచెప్ప నుద కేడ్చుచుఁ గ్రిమ్మఱివచ్చుచుండఁగా
నయ్యదిగూడవచ్చి సలిలాశయ మొక్కటిచూపె మా కటన్ ౨౪౫

ఉ॥ అం దవి వైచుమాత్రమున నప్పుడె శుభ్రములౌటయున్ వెఱం
గందుచు నేనుగూడనిగి యట్టె మునింగి బహిర్గతుండఁగా
నిందుసముద్యుతిం బోలిచ నెల్లశరీరము, మూర్ధంబు తీ
చందము తెల్లనై నయుని నానలు రోతపడంగ నేలొకో, ౨౪౬

వ॥ నావుడుఁ బుడమివేల్పులు కౌతూహలసమన్వితులై యచ్చటికరిగి పరీక్షార్థమై కేశాది కృష్ణద్రవ్యము లనేకము లందు ముంచుటయు నన్నియు మలీమసవర్ణంబును

వదలి శుక్లత్వంబు వహించె, నంత శ్వేతమూర్ధజులగు వృద్ధులును దరుణులును ధర్మశ్రీ ద్ధమై నందు స్నాతులగుటయుఁ దేజోవీర్యసమన్వితంబుగా శ్వేతసర్వాంగులై తత్ప్ర భావంబునఁ బరమపదంబు వడసిరి, తత్ప్రభవంబులగు ధవళదర్భలచే శ్రీద్ధమై శ్రాద్ధంబు పెట్టువాఁడు నరకస్థులగు పితరులంగూడఁ దరింపఁజేసెడి" నని యిట్లు సూతుండు చెప్పు టయు ఋషులిట్లనిరి, ౨౪౮

ఆ॥ "శుక్లతీర్థమెట్లు సురుచిర తత్త్వలప్రభవమయ్యెఁ బలుప్రభావమునను?
విస్తరించిమాకు వినిపింపవయ్య రోమహర్ష! ధీసమేత! సుకవిగీత!" ౨౪౯

వ॥ అనియిట్లుప్రశ్నించుటయు సూతుండు ౨౫౦

కం॥ "కలిభీతుఁడగుచు విష్ణుం డిలపైఁ దత్తీర్థమునకు హితమతితోడన్
బలిమిని శ్వేతద్వీపముఁ దెలుపువిఖ్యాతిగఁ దాను దెచ్చెను జుండీ, ౨౫౧

కం॥ కలిచే స్పృశింపఁబడినను వల శ్వేతద్వీపమునకు శ్యామలవర్ణం
బలవడదు గాన హాయిటు నిలిచెను దత్తీర్థమందు నెటి నద్దానిన్, ౨౫౨

## — వాల్మీకి పూర్వవృత్తాంతము —

వ॥ మునుపూర్వంబున వచ్చెయొకతీర్థంబటమున్నయది, యచట బ్రాహ్మణులగు మునిశ్రేష్ఠుల కొక చోటయందు సంగతుఁడగుటయుఁ దత్ప్రభావంబు నంజేసి యతండు సిద్ధినిబొంది వాల్మీకినాఁ బ్రథితుండై రామాయణనిబంధనంబు రచియించెఁ, జమత్కార పురంబునఁ దొల్లి మాండవ్యాన్వయసంభవుండై యొకద్విజుండు లోహజంఘుండను పేరఁ బితృమాతృతత్పరతం బ్రవర్తించుచుండె, నతనికిఁ బ్రాణంబులకంటెఁ బ్రియంబైన పత్ని యొక్కయుండి పతిప్రాణయుఁ బతివ్రతయునై ప్రవర్తిల్లెను, బ్రహ్మవృత్తిమై నతం డట్లు పెద్దకాలంబు పుచ్చుటయు నొకప్పుడు శక్రుండు వర్షింపమిన నద్దేశంబున ద్వా దశవర్షక్షామంబు సంభవించె, నంత లోహజంఘుండు క్షుధార్తులగు తలిదండ్రులను భార్యను దిలకించి మహాదుఃఖంబు న ౨౫౩

కం॥ "ఏమిచెయుదరింతునింక, నేభూములకుఁ జనుదుఁ దనువుపోషించుకొనన్,
నా మాతాపితరులు ప్రియకామిని క్షుద్బాధనొందఁగా నెటుచూతున్ ౨౫౪

వ॥ అనిచింతించి పండ్లేని యిన్ని తెంచి తెత్తునని విపినంబునకుం జనుడు మ్రాఁకు లన్నియు నెండియున్నకతంబున నొక్కటేని దొరకదయ్యె, నంత ధాన్యావశిష్టంబగు కొలఁది చొప్పకట్టయొకటి బుజంబునం బెట్టుకొని మహాశ్రమంబునం జను ముసలిది యొక్కతె కనంబడ నిర్దయుండై యా చొప్పకట్టయుఁ దద్వస్త్రంబులును బలిమిమై హరించి సంతసించుచు నింటికింజని పితరులకు నివేదించె, లబ్ధలక్షుండయ్యె నిట్లు ప్రత్య

హంబు ను స్వకుటుంబమును చౌర్యంబునఁ బోషించుకొని సుభిక్షమైనను రెండవపని
యొల్లక బ్రాహ్మణవృత్తిమాని దొంగతనంబుచేయుచు నొక్కయెడఁ దీర్ఘయాత్రాప్రసంగం
బునంజను మరీచిప్రముఖ సప్తర్షుల విజనప్రదేశంబునం బొడగాంచి క్రోధాటోపసమన్వి
తంబు గా దండమెత్తి కొట్టువానికరణి "నిలుండు నిలుండని" పరుషవచనంబుల భర్త్సిం
చుచు వెంటఁబడుటయు నమ్మునులు యరుకెంకరుచాద్భుత యజ్ఞోపవీతసహితంబు గా
నరుదెంచు నాతని విలోకించి యనుగ్రహాసమేతులై ౧౫౫

మ॥ "అరరే! బ్రాహ్మణుభంగిఁ గానఁబడెదే, వట్లయ్యు ని ట్లేల త
స్కరవృత్త్యమునం జోరంబడితి? వీకర్మంబు మ్లేచ్ఛాది దు
ష్పురుషుల్ సేడ్తి, దేము వరౌనులము, మాబోంట్ల ధరాద్విజశ్రేష్ఠికిన్
గుణిర్యైనారో కో హూర్యా! మాకడ నివే నోము ల్గుటఁడించెదికా, ౧౫౬

తే॥ గోచిపాతలరామండు గోఁచుకొనెడి దొంగలకు మిండఁడనియైనఁ దోఁపలేదె?
నిష్పరిగ్రహులము మేము, నీవునిచట దొరక దొక్కంతయును బోర దుర్విచార!"

వ॥ అనివక్కాణించుటయు లోహజంఘుం డిట్లనియె, ౧౫౭

తే॥ "నారచీరలు కృష్ణాజినములు కొన్ని గలవు మీకడఁ బావుకోళ్ళు, లలి వాని
నిండు, లేకున్న నీ దృఢదండమునను దలలు బ్రద్దలుగాఁబిండి బలిమిఁగొందు" ౧౫౮

వ॥ అనవుడు ఋషులు మఱియునిట్లనిరి, ౧౬౦

ఉ॥ "అన్నియు నీకొసంగఁగల మట్టులె కాని మలిమ్లుచా! నినున్
గొన్నిటి ప్రశ్నచేయవలెఁ, గోపమునొందక చెప్పు, మన్న యే
మన్నను నీవు బ్రాహ్మణుఁడవయ్యును దొంగతనంబు చేయఁగా
నున్న కతం బదేమి? కడుమోహ్యపుఁగైదమిదంచు నెంచితో? ౧౬౧

కం॥ కలుదాగివం బల మొక్కఁగ నలవాటుమెయ్యనో కో దారి కడ్డముచని యీ
లలిఁ దలలు పగ్గులొనరుపఁ? గులముఁ బిపుగ్ఁడవు కాక కోయవె యగుదో?"

వ॥ అనియిట్లడుగుటయు వెండియు నా లోహజంఘుండు. ౧౬౩

ఆ॥ "కల్లుదాగివ, మాంసఖండము భక్షింప, ద్యూతమాడ, మఱియుఁ దొత్తునుంపఁ,
బుణ్యమగు కుటుంబపోషణమునకె యీ దొంగతనముసేయఁదొడఁగినాఁడ,

వ॥ తలిదండ్రుల్ శతవృద్ధు, లాలయకిరిగుణాధారేయయుక్ సాధ్వ యు
గ్మలి, చౌర్యంబున నంతో యింత యిటు సంపాదించికొంపోయి వా
గలకేపెట్టెద దైవసాక్షిగను సర్వం, బందుచే మీకడన్,
గలదెల్లన్ మొదలింకు, లేచెడిని వేగం గొట్టఁజై మీఁదికిన్, ౧౬౪

వ॥ అనియిట్లు పలుమాటలకుఁ జోటీక తెరువాటుకాఁడు తొందరించుటయు ఋషులు మఱియు నిట్లనిరి. ౨౬౬

మ॥ "అటులైనం జని నీకుటుంబమును నీయార్జించు మన్నట్టి యు
త్కటపాపంబునఁ "బాలుపంచుకొనెదా ? కాదందువా?" యంచుఁ బ్రి
స్ఫుటవాక్యంబుల నడ్గు, పంచుకొనుచోఁ జోరత్వముం జేయు మె
ప్పటియు; ట్లిందుల కొప్పదేని యిఁకనీ పాపంబు ఘోరంబగున్, ౨౬౭

ఆ॥ ఘోరరౌరవమునఁ గూలెదో దుర్మతి ! ద్విజుఁడవనుచుఁ గృపను దెలుపుచుంటి,
మస్మదాదు లూరక గుపడ, రటుగాన నీ కెదేని శుభము చేకురెడిని, ౨౬౮

క॥ కలుషము చేసెడిదొక్కఁడు, ఫలమును భుజియించువారు పలువు, రట్లైనన్
గలుగదు దోషము వారికిఁ, గలుషమునకు బాధ్యుఁడొక్క కర్తయె తుదకున్ ౨౬౯

వ॥ నావుడు ముడియుబడు పించుక జడిసినవాఁడై ౨౭౦

ఉ॥ "సత్యమ యేతదుక్తి యిట సంశయ ముండదు గాన నేగి యీ
కృత్యమునుండి కల్గుఫల మింతయొ యంతయొ మత్కుటుంబమున్
నిత్యముఁ బంచుకోఁగలదొ నేనె భుజింపఁగ నౌనొ యడ్గి యీ
వాత్యపుఁజేఁత చేయుటకొ వద్దని మానుటకో యతించెదన్, ౨౭౧

చం॥ ఋషివరులార ! మీర లెటకేని పలాయనమాచరింపరే
ఋషితకుటుంబ సన్నిధికిఁ బోయి త్వదుక్తము ప్రశ్న సేతుఁ గి
ల్బిషమునఁ బాలుపంచుకొనఁ బ్రీతులుగా భవదీయవస్తువుల్
ముషితములౌను, గాదనినఁ గొందు యథేచ్ఛ స్పృశింప మిమ్మిఁకన్ ౨౭౨

వ॥ అనివాక్రుచ్చుటయు నమ్మించుటకుఁగా నొట్టుపెట్టుకొని యక్కటికంబున నతని గృహంబున కనిచిరి, యట్లు చని జనకుం గని ౨౭౩

చం॥ "విను జనకా ! సుధీరితము, వించు నెయుత్తరమిచ్చి సంశయ
మ్మును మొదలంటఁగాఁ దునుము, మూఁతఁ జోర్యముఖాఘకృత్యముల్
పొనరిచి నిత్యమేను నినుఁ బోషణ చేయుచునుంటిఁ గాన నా
యొనరునఘంబు పంచుకొనెదో వలదందువొ చెప్పుమీ కృపన్" ౨౭౪

వ॥ అనియతండు వక్కాణించుటయుఁ బిత యిట్లనియె, ౨౭౫

ఉ॥ "చిన్నతనంబునందు నినుఁ బ్రేమను గష్టములన్ సహించి యు
న్నన్నొ శుభాశుభక్రియల నేఁ బొనరించుచుఁ బెంచుకొంటిఁ గా
న న్నను నీవు వార్ధకమునన్ మఱిఁ బోషణసేయుచుంటి, వ
న్నన్న ! త్వదీయపాతకమునం దెటు నాకిఁక భాగముండెడున్ ౨౭౬

తే॥ పుణ్యమో యన్యమో తాను బూనిచేయు కర్మమునకెల్ల బాధ్యుండు కడకుఁ దానె
తెచ్చిపెట్టిన భుజియింపవచ్చువారు పలువు, రవ్వారి కే ఫలభాగమేల? ౨౭౭

సీ॥ స్వకులోచితంబైన సత్ప్రతిగ్రహముచే సన్మానితుఁడవౌచు సంతరింతొ,
యాపదర్థంబైన వ్యవసాయమునదిగి కష్టార్జనమునకే కడఁగినావొ,
క్రయవిక్రియక్రియాకరణధౌరేయతం బుష్కలద్రవ్యంబు ప్రోగుచేతొ,
బాటసారులతల ల్బద్దలుగాఁగొట్టి తుందుడుకొప్పంగఁ గోఁచితెత్తొ,
యేమిచేయుచుంటొ, యెవ్విధినార్జింతొ, యీవిచారమెల్ల నేలనాకుఁ,
దెచ్చియిచ్చుదానిఁ దినువారమే కాని ఫలముగుడువమేము పాలుపడము, ౨౭౮

కం॥ కావున నిది మదినుంపకు మోవత్సా! నింద్యకర్మ మొనరించెద నేన్
నీవ తదేనఃఫలమును దేవుఁడయని యనుభవించితీరఁగవలయున్, ౨౭౯

వ॥ అనియిట్లు ప్రత్యుత్తరంబొసంగుటయు నతండు వ్యాకులితాంతరంగుండై తల్లిపాలికిని ధర్మపత్నిపాలికిని జని యదేవిధంబుగం జెప్పంబడి పశ్చాత్తాపంబునఁ దన్నుఁదా నిందించుకొనుచుం బోయి జడదారుల దరిసించి నమస్కరించి ౨౮౦

చం॥ "చనుఁడు చనుండు బ్రాహ్మణులు! సల్పితిఁ దర్జనభర్జన ల్కడున్,
మనమునఁబెట్టుకవ్వి నను మన్ననచేయుఁడు చేయుఁ, డింటికిన్
జని జనయిత్రినిన్ జనకు జాయను బ్రశ్నముసేయ వారు నా
యొనరుచు దుష్క్రియన్ ఫలము నొల్లమటంచని రించుకేనియున్, ౨౮౧

కం॥ దురపిల్లుచుంటిఁగావునఁ గరుణను నేఁజేసినట్టి కలుషములెల్లన్
దొలఁగ నుపదేశమొనరిచి సగవిని రక్షింపుఁడయ్య సాధువరేణ్యుల్! ౨౮౨

సీ॥ పాఱులెందఱో బిట్టు దూఱంగ నోరుమ్మసి గుంజికొంటిఁ గొలాయగుడ్డమూటు,
లబలలెందఱో కరం బఱవంగఁ జెఱఁబట్టి యొలిచికొంటిని బల్మి నొడలినగలు,
మౌనులెందఱో తాపమూనంగ దయమాలి యపహరించితి వల్కలాజినముల,
బీదలెందఱో గోలపెట్టఁ గొట్టుచు విడ్చిపెట్టించితిని గట్టుపుట్టములను,
దిరుగఁబడఁ జేతగాని యీతీరువారి నెందఱినో యేడిపించితి నీవిధమున
మంచిసహవాసమొనరమినుంచి నేను దత్కుటుంబనిమిత్తమై తపసులార! ౨౮౩

తే॥ చదువుకొను బాలకునకు శాస్త్రంబువోలె గట్టిగా నాకుఁ జౌర్యంబు పట్టువడియె,
నిపుడు మీదృష్టిఁబడకున్న నింకనెన్నొ కొలలు నిస్సంశయంబుగా సలుపుచుంటి"

వ॥ అనిపలుకుటయు వారలలో హాస్యశీలుండగు పులహుండు ౨౮౪

ఉ॥ "నేనొక మంచిమంత్రిమును నీ కుపదేశముచేయువాఁడ న
ద్దాని జపింపుమీవు ద్విజ! తప్పక యుష్మదభీష్టసిద్ధియౌ
మానక జాటఘోటయను మంత్రి మహర్నిశము జపింపఁగన్
బూనెదవేని వేల్పులును బోలరు నిన్నిఁక నేమిచెప్పుదున్ ౨౮౫

వ॥ అని వేళాకోళంబుగావించి విప్రలోకంబు వెడలిపోవుటయు నాతెరవాటుకాఁడు తత్స్థలంబునన యనన్యమానసంబున జపంబు ప్రారంభించి నిశ్చలకాయుండును నిశ్చలసమాధిగతుండును నైయుండనుండఁ బుట్టపుట్టి చుట్టు నావరించుకొనియెఁ, గొంత

కాలంబున కమ్మార్గంబున నమ్మునులు తీర్థయాత్రనుండి క్రమ్మఱలి వచ్చుచు వల్మీక మధ్యంబునుండి వినఁబడు జాటుఘోటయను నస్మహాత్మునిమంత్రస్వనంబును నలుదిక్కుల నుండి వినవచ్చు ప్రతిధ్వనియు నాకర్ణించి పరిహాసమునకుఁ గాఁబులహుండు చెప్పిన మంత్రంబు జపించుచు వల్లడికాఁడు వల్మీకంబాననుంట యూహించి ౭౭

ఆ॥ "అర్థశూన్యమైన యల్పాక్షరంబులే పఠనఁ జేసియితఁడు పడసె సిద్ధి,
గాన శాస్త్రదృష్టి గలిగిన యాచార్యవరులు నుడువునుడులు వాస్తవములు, ౭౮

సీ॥ అర్థశూన్యాక్షరం బగుఁగాక యయ్యది మంత్రమంచు జపింపఁ గాఁ బ్రతు సిద్ధి
యపవిత్రపుంగుంట యగుఁగాక యయ్యది తీర్థమం చటుఁ గ్రుంకఁ దీఱునఘము,
మిగులఁ దిమ్మన్మాత్రుఁడగుఁగాక యాతండు బ్రాహ్మణుండని మ్రొక్కఁబడయుశుద్ధి,
పగులఁగొట్టిన రాయియగుగాక యయ్యది దేవుఁడంచని వేఁడఁ దీర్చుఁ గోర్కి
జోస్యుఁడనియద్గ్రబశ్న౦బు నూటిపడెడు, నౌషధంబని భక్షింప నడఁగుఁ దెగులు,
గురుఁడటంచును సేవింప గుణముగలుగు, నెట్టి నెటుల భావనముసేయు నటుల సిద్ధి"

వ॥ అని విస్మయావిష్టులును విశేషించి కృపావిష్టులును నై పదపడి సమాధి యోగ్యంబులగు తైలములచేతను భేజంబులచేతను సమాధిగతంబగు తద్గాత్రంబును దడవు మర్దించుటయు నా లోహజంఘుండు చేతనంబునుబొంది కనువిచ్చి మాటిమాటికిఁ దిలకించి మాఱునుపడినవాఁడై ప్రకృతులనుకొని యమ్మునుల గుఱించి యిట్లనిరె, ౭౯

తే॥ "ఏల యింకను జనరండ నిచటనుండి, రేఁ గుటుంబముకొఱకుఁ గా నింక యుష్మ దజినముఖముల హరియింపననుచు నప్పుడె వదలితిని బొండు ద్విజులార! వలయుకడకు"

వ॥ నావుడు మునులిట్లనిరి, ౮౦

ఉ॥ "అప్పుడె వెళ్లిపోయితిమి, యందును నందుఁ జరించి వెండి మే
మిప్పుడు వచ్చియుండితిమి, యెంతయు యయ్యెను గాల, మద్ది బ
ల్గొప్ప సమాధినుండుటను గొంచెముగూడ నెఱుంగవైతి, నీ
యప్పయు నమ్మయుఁ సతియు నంతమునొందిరి తద్వ్యముక్తులై" ౮౧

క॥ నీవు తపస్సిద్ధుఁడవై తోపిపాప ! మాదుకరుణ నుఱువాల్మీక
ప్రావృతిసిద్ధినిగాంచుటచే వాల్మీకియనఁబడెదు క్షితి నిఁక మీఁదన్ ౮౨

తే॥ ఇచట నీచేత బలిమిమై నెంతమందొ ముష్టులై యున్న వారలు మున్ను గాన
నిది ముఖారంబునా ఖ్యాతి నెనసి జగతిఁ దీర్ఘమగు నీదినంబొది ద్విజవరేణ్య! ౮౩

క॥ ఎవరిట శ్రద్ధను శ్రావణి నవగాహన మాచరింతు రవ్వారలు తా
మవనిని ముక్తిచ్ఛలికొనునఘ మవవీలం గడిగివైతు రవనీవిబుధా! ౮౪

వ॥ అనియిట్లు వాక్రుచ్చి యప్పవిత్రులమ్మునిచే నమస్కృతులై యిచ్చవచ్చిన దిశకుం జనిరి, యావాల్మీకియు నవ్వోటన తపంబుండుచు మునిశ్రేష్ఠుండయ్యె ౮౫

## చందాయీవలసిన ప్రధాన పోషకులు.

రాజా బెల్లపురవల వెంకటరాఘవేంద్రరావు బహదరు జాగీరుదారుగారు,
నవాబుపేట

శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు

### పోషకులు

౧ యార్లగడ్డ గంగనాయకులు నాయుడుగారు, కారంచేడు
౨ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు
౩ అల్లాడి లక్ష్మణరావుగారు, కరణం, జంగపల్లి
౪ సింగీతము అమృతరావుగారు, మక్తేదారు, కోన్న

### సహాయులు

౧ పట్వారి నారాయణరావుగారు, క్షీరసాగరము
౨ నెల్లుట్ల నరసింహారావుగారు, చినమడూరు
౩ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల
౪ మెదక్ సీతారాంరావు దేశముఖుగారు, నల్లపల్లి
౫ నార్నపాటి వెంకటసుబ్బారావుగారు, నల్లపల్లి
౬ నరసింహస్వామివారు, యాదగిరి
౭ బీరకాయల రామారావుగారు, రాయగిరి
౮ భాస్కరరాయని వెంకటరామయ్యగారు, గంగపల్లి
౯ శివలెంక రామలింగయ్యగారు, డాక్టరు, హనుమకొండ
౧౦ పిల్లలక్షి సోమయాజులుగారు, తహశీలుదారు, గురిజాల
౧౧ జానపాటి సుబ్రహ్మణ్యంగారు, ఆక్టింగు కరణం, పాపయాపాలెము
౧౨ చిక్కరాజు పట్టుపల్లి రావుగారు, కరణం, చెలకుర్తి
౧౩ జూలూరి వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు
౧౪ కవులూరి నరసింహారావుగారు, ఈలప్రోలు
౧౫ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు

# అభినవసరస్వతి

పత్రికాధిపతి:— జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును బ్రకటింపబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ఆశ్వలయాచార్యవిజయము | ... | 0 | 4 | 0 |
| 2 | కరణికోద్ధారిణి [పూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 4 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి [సింహాద్రి వెంకటాచార్యులు] | | 0 | 4 | 0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతులు [సుమతిశతకమునకు సంస్కృతము] | ... | 0 | 2 | 0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 9 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 10 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము [పత్రికాధిపతి] | ... | 0 | 4 | 0 |
| 11 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 12 | గురిగింజ | ... | 0 | 1 | 0 |
| 13 | పుళిందావివాహము [పత్రికాధిపతి] | ... | 0 | 4 | 0 |
| 14 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 15 | శివానందలహరి [తంగెడ రామకృష్ణకవి] | ... | 0 | 4 | 0 |
| 16 | లక్ష్మీవిలాసము [రాయసము వెంకటపతి] | ... | 0 | 4 | 0 |
| 17 | నరసారావుపేట శతావధానము [తిరుపతివెంకటీయము] | | 0 | 3 | 0 |
| 18 | పశ్యంపశ్యాం | ... | 0 | 2 | 0 |
| 19 | పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 20 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 21 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 22 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 23 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 24 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 25 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము | ... | 0 | 1 | 0 |
| 26 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 27 | స్కాందమహాపురాణాంతర్గత కాశీఖండము | ... | 1 | 0 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము,
జానపాడు, పిడుగురాళ్ళపోస్టు
గుంటూరుజిల్లా.